# సంజప్రణయం

(కథలూ - గల్పికలూ)



★

పూ భా

★



శోభా ప్రచురణలు
విజయనగరం.

ప్రథమ ముద్రణ
హేవిళంబి - చైత్రం
1957

★

హక్కులు
రచయితవి

★

ముఖపత్రాలంకరణ
శ్రీ అ. పైడిరాజు

★

ముద్రణ
శ్రీ కృష్ణా పవర్ ప్రెస్
విజయనగరం

★

వెల
50 నయాపైసాలు

★

సంపాదన : ప్రచురణ
శ్రీమతి ఆర్. వి. రమణమ్మ
శోభా ప్రచురణలు
విజయనగరం.

# ఇందులో



యీ కథలూ, కల్పికలూ లోనిపాత్రలూ,
సంఘటనలూ కేవలం కల్పితం.

అంకితం

శ్రీ చెల్లూరి చిరంజీవిరావుకి

— పూభా

కృతజ్ఞత

శ్రీ కృష్ణా పవర్ ప్రెస్ ప్రొప్రయిటర్

శ్రీ అండలూరి సాంబశివరావుగారికి

— శోభాపరిచరణలు

# ★ రాజేశ్వరి ★

ఆడదే మరెవరైనా అయితే యీసాంఘిక నేరానికి చట్టం నిర్ణయించిన పూర్తి శిక్షను తనఅధికార హోదాతో విధించే ఉండేవాడు కాని...

...కాని ఆమె కేవలం తన భార్య అయిపోయింది.

వలుగురులోనూ మెసలడం ఎలాగో చాతకాక పరితివాళ్ళతోనూ తగువులు తెస్తూంటే ఎన్నాళ్ళని భరించడం.

తన మంచితనం, ఉద్యోగహోదా ఎవరికి కావాలి, అందులోనూ యిరుగూ, పొరుగూ ఆడవాళ్ళకి.

ఎంతకని యిల్లు మారుస్తూండడం.

కనీసం నెలరోజులైనా ఒక యింట్లో సవ్యంగా ఉండలేకపోతే ఎలా చావడం.

ఇది వెంకటారావు నిత్యజీవిత సమస్య.

నానాటికీ శృతిమించుతున్న ఈ దుర్భర సమస్యని యికనైనా అంతు చూడకపోతే తన భార్య మాట అటుంచి తనకూడా సంఘంలో మసిలే యోగ్యత క్షీణిస్తుందేమోనని భయపడ్డాడు వెంకటారావు.

చూసి చూసి ఒక సుముహూర్తాన తన పైఅధికారి దగ్గరకు వెళ్లాడు.

ఎలాగైనా తనని మహాటవీ మధ్యంలో ఒక మన్యం తాలూకాకి బదిలీ చెయ్యమని కోరాడు.

పై అధికారి ఆశ్చర్యపడ్డాడు.

ఆ తాలూకాకి ఎవరిని బదిలీచేసినా 'వెళ్ళను బాబో' అని తప్పించుకుందికి విశ్వప్రయత్నం చేసేవాళ్ళే కాని సంతోషంగా వెళ్ళినవాడు యింతవరకూ ఒక్కడైనా లేడు. అటువంటిది వెంకటాావు బుద్ధిపూర్వకంగా అక్కడికి బదిలీకావాలీ అని అంటే, పై అధికారికే ఏమిటి, ఆ తాలూకా సంగతి తెలిసిన అందరికీ ఆశ్చర్యం వేస్తుంది.

పై అధికారి చాలా సంతోషించాడు. వ్యవహార దక్షుడైన వెంకటాావు అక్కడకు వెళతానన్నందుకు.

వెంటనే టైపుమిషను టపటప లాడింది.

ఆర్డరు పట్టుకొని టకటక బూటుతో యింటికి వచ్చాడు వెంకటాావు.

భార్యను పిలచాడు.

'యీవేళ యింత త్వరగా వచ్చేశారేం'? అంది భార్య రాజేశ్వరి.

'యీరోజుతో యిక్కడ ఉద్యోగం అయిపోయింది. మనకి బదిలీ అయింది'

"ఎక్కడికి"

"మన్యం తాలూకాకి"

'అమ్మ బాబోయ్!'

'ఎప్పుడూ ఒక్కదగ్గరే కూర్చుందామనుకున్నావేం పాపం'

"పెళ్ళి అయ్యి ఆర్నెల్లైనా అవలేదుకదా అప్పుడే బదిలీ ఏమిటండీ?"

"మరి నీ తడాఖా అంటే ఏమిటనుకున్నావ్ "

"మధ్యని నేనేంచేశాను!"

"ఏయింట్లోఉంటే ఆయింటి యిరుగు పొరుగుల వాళ్ళతో మనం తగువులాడుతున్నావట. అందుకని వాళ్ళందరూ మనమీద కాయితాలు వ్రాసి పైఅధికార్లకు పంపారు, మనం నలుగురిలోనూ తిరిగే యోగ్యతలేని వాళ్ళమని యిలాచేశారు" అని అతినేర్పుగా అబద్ధ మాడాడు వెంకటావు.

"మనమేం తగువులు తెస్తున్నామండీ" అంది కోపంగా రాజేశ్వరి.

అప్పుడే ఆమె ముఖం జేగురు రంగుగా మారటానికి ప్రారంభిస్తోంది.

"అదే నేనూ ఆలోచించి ఆశ్చర్యపోతూన్నది. అయినా యిదీ మన మంచికేగా. అక్కడ చక్కని యిల్లు ఉంది. ఎక్కచ్చీగా మనమే వాడుకోవచ్చు. యిరుగూ, పొరుగూ ఎవరూ లేరు. నువ్వు తగువు తెద్దామన్నా అలాంటి అవకాశంలేదు.

"నలుగురులాగే మీరూ అనండి నేనేం తగువులు తెస్తున్నాను చెప్పండి. యింట్లో మీరు యిలా అంటూ ఉంటేనే ఊళ్ళోవాళ్ళు మరీ అంటున్నారు"

"వాళ్ళని నువ్వూ ఊరుకోవడం లేదుగా"

"అయితే మీఉద్దేశం అందరిచాతా మాటలు పడమనేనా ?"

అప్పుడే భార్యలోని మార్పుని గమనించాడు వెంకటావు. యింక యితంకన్న ముదర బెడితే లాభం లేదనుకున్నాడు.

"పోనీలే యిప్పుడు అయిపోయినదాని కెందుకు" అన్నాడు.

"అయితే మన యింటి సంగతులన్నీ ఆఫీసువాళ్ళ కెందుకండీ నాకు తెలియక అడుగుతాను"

"నిజమే కాని మనం సంఘజీవులం కాబట్టి సంఘంతో ఐకమత్యంగా ఉండాలి. అదే మనకి చాతకాదని వారి అభిప్రాయం"

## 2

మహారణ్యం మధ్య మెలికలు తిరిగిన ఘాట్ రోడ్డు మీదనుంచి బస్సు నిదానంగా నడుస్తోంది. ఒక ప్రక్క కొండ. మరోప్రక్క పాతాళానికి దారితీసేఅగాధం. ఆ అగాధంవైపు చూస్తూంటే కళ్ళుతిరిగి గుండె జారిపోయి నట్టుండేది రాజేశ్వరికి. ప్రమాద నివారణకై అగాధంవైపు కట్టిన పిట్టగోడకి మెలికలు తిరుగుతున్నప్పుడు ఎన్నోసార్లు ఢీకొనేది బస్సు. దురదృష్టవశాత్తు పిట్టగోడ పడిపోతే బస్సూ, బస్సులోఉన్న మనుష్యమాత్రులూ, ఏమైపోతారు అనుకుంది ఆమె. ఒక్కసారి డ్రైవర్ని చూసింది. సకల భువన రక్షకుడైన చక్రపాణివోలె డ్రైవరు స్టీరింగు చక్రాన్ని పట్టుకున్నాడు. ఆక్షణంలో సాక్షాత్ భగవంతుడైన ఆ స్టీరింగు చక్రపాణిని ప్రాణబిక్ష పెట్టమని మనస్సులో ప్రార్థించింది.

ఘాటీ ఎక్కలేక మూలుగుతూ, మూలుగుతూ, మందగమనం సాగిస్తోంది బస్సు. ఆ గమన కుధర యానంలో రకరకాల వృక్షాలూ, వాటి పుష్పాలూ,

వాటి పరిమళాలూ, ఆ వింత ప్రకృతీ, ఆ వన సౌందర్యం నిజంగానూ పోసి అనుభవించవలసినదే కాని...

...కాని దురదృష్టవశాత్తూ పిట్టగోడ పడిపోతే బస్సూ, బస్సులో ఉన్న మనుష్యమాత్రులూ ఏమై పోతారో అన్న ప్రమాదకరమైన ఆలోచనలో పడ్డ గాజేశ్వరికి ఆ రకరకాల వృక్షాలూ, వాటిపుష్పాలూ, వాటి పరిమళాలు, ఆ వింత ప్రకృతీ, ఆవన సౌందర్యం ఏమీ కనిపించనేలేదు.

ఎలాగైతేనేం బస్సు మెల్లిగా ఘాట్ రోడ్డును దాటేసింది. అలవాటు ప్రకారం డ్రైవరు బస్సును ఆపుచేసి ఘాట్ రోడ్డులో ఏప్రమాదం రాకుండా బస్సునీ, బస్సులో ఉన్న ప్రయాణీకుల్నీ కాపాడినందుకు అక్కడ వనదేవతయైన చెట్టుక్రింద బండకి ఒక కొబ్బరికాయ కొట్టి మళ్ళీ బస్సు ఎక్కాడు.

బస్సు గమ్యస్థానం చేరుకుంది. ఏజన్సీ తాలూకాకి ముఖ్యపట్టణమైన ఆగ్రామంలో పాతిక ముప్పై యిళ్లుకన్న ఎక్కువ ఉండవు. ఊరిజనాభా ఒకవందకు మించదు. నాలుగైదుశాఖల ఉద్యోగస్తులూ, వారి గుమస్తాలూ, బంట్రోతులూ, ఒక ముఠాదారూ మొత్తంమీద అందరూ ఉద్యోగస్తులే. వాళ్ళయిళ్ళూ, ఆఫీసులూ కాక పైగాఉన్నవి-ఉద్యోగుల సౌకర్యార్థం వెలసిన ఒక దేశవాళీ కాఫీహోటలూ, చిన్న కిరాణాదుకాణం. ఉన్న ఆ పాతిక ముప్పై యిళ్లుకూడా అక్కడా అక్కడా ఉన్నాయ్‌కాని ఒకచోదగ్గర లేవు. ఊరికి నాలుగువైపులా ఎటుచూసినా మహారణ్యం. మూడు దశాబ్దాల క్రిందట ఆప్రాంతంలో లేచిన పితూరీలో శాంతి భద్రతలు నెలకొల్పడానికి తెల్ల

దొరలు యీ వూరిని సృష్టించి ఆఫీసులు పెట్టారు. ఇక్కడ ఆఫీసుల్లో చెప్పుకో తగ్గంత పనీపాటూ ఏమీ లేకపోయినా అక్కడ ఉన్నందుకే ఉద్యోగస్తులకి జీతం యివ్వవచ్చు. ఉదయం తొమ్మిది గంటలకు గాని పొగమంచు తెరలు విడవు. అప్పుడు సూర్యదర్శనం అవుతుంది. తిరిగీ మూడు గంటలకు సూర్యుడు మాయమౌతాడు. శీతాకాలంలో మరీకష్టం. ఆ చలికి కొరడు కట్టిపోవల్సిందే. యిరవైనాలు గ్గంటలూ నెగళ్లు పెట్టుకోవల్సిందే. అక్కడ నీరుత్రాగితే ఆజన్మాంతరం మలేరియా వదలదని ప్రతీతి. కాని మలేరియా నివారణశాఖవారు చేస్తున్న కృషివల్ల దాని ఉధృతం తగ్గింది. ఏమైనా ఆవూరు ఒక పీడకల వంటిది. నేరస్తులకు పూర్వము అండమాన్సు ఎటువంటిదో ఉద్యోగస్తులకు ఆవూరు అటువంటిది.

## 3

విశాలమైన మూడు గదులూ, ఒకవంటిల్లూ, యింటి ముందు ఆవరణలో రకరకాల పువ్వులచెట్లూ, పెద్ద పెరడూ– యిల్లు చూడగానే పిల్లా, పిచికా లేని దంపతులకి ఆయిల్లు పెద్దదనే అనిపిస్తుంది.

యింటి గురించి ఎటువంటి వ్యాఖ్యానాన్ని చెయ్య లేదు కాబట్టే రాజేశ్వరికి యిల్లు నచ్చినట్లే.

ఆ కొత్త ప్రదేశంలో, నూతన వాతావరణంలో వారంరోజులు గడిచాయి. ఆ ప్రదేశానికిగానీ, ఆ వాతావరణానికిగానీ యింకా రాజేశ్వరీ, వెంకటాద్రివూ అలవాటు పడనేలేదు.

రోజులు గడవడం అక్కడ చాలా కష్టంగానే ఉంది. వెంకటాద్రివు ఎలాగో ఒకలాగ ఆఫీసుపనితో కాలం సరి

పుచ్చుతున్నాడు గాని, రాజేశ్వరికి పగలు తరగకుండానే ఉంది. నవలలూ, పత్రికలూ, ఎంతసేపని చదువు కుంటుంది. ఖాతాకాని మొదలెడదామంటే యిరుగూ, పొరుగూ లేదాయె.

రోజులు గడిచిపోతున్నకొద్దీ ఒకరోజు కొకరోజు అక్కడ జీవితం ఆవిడకు కష్టమే అనిపించింది. కష్టమన్న మాటే ఏమిటి నిజంగా జైల్లో ఉన్నట్టే బాధపడింది.

ఒక రోజున వెంకటాద్రి క్యాంపు వెళ్లిపోయాడు.

చీకటిరాత్రి.

యింటిదగ్గర కాపలాకై పడుకునే ముసలి బంట్రోతు యింకా రాలేదు.

ఎటుప్రక్క చూసినా గాఢాంధకారం.

నాలుగు మూలలనుంచీ నక్కల అరుపులూ, కీచు రాళ్ళధ్వనీ, హోరుమనిగాలీ.

రాజేశ్వరికి భయం పట్టుకుంది. యిన్నాళ్ళూ భర్త తోడుగా ఉండేవాడు కాబట్టి ధైర్యంగానూ, ధీమాగానూ ఉంది. కాని యీరోజున కారు నల్లని కాళరాత్రి ఆమెను భయపెట్టింది. ఎదురుగా ఆచీకట్లో జుత్తు విరయపోసు కున్న దెయ్యంలాఉన్న జీలుగు చెట్టును చూసి ఆమె 'అమ్మో' అంది.

"ఏమమ్మా" అన్నాడు బంట్రోతు.

బంట్రోతు ఎప్పుడు వచ్చినదీ కూడా ఆమెకు గుర్తులేదు.

"ఎప్పుడొచ్చావ్ శీతయ్యా...నాకు భయంవేస్తోంది. చూడు అదేదో దెయ్యంలా ఉంది."

"మరేం భయంలేదమ్మా! నేనిక్కడే ఉన్నానుగా. అది దెయ్యంకాదమ్మా, భూతంకాదమ్మా, రోజూ మనంచూసే జీలుగుచెట్టే తల్లీ!"

"ఏమో నాకు చాలా భయంవేస్తోంది".

"ఏం భయంలేదమ్మా. తమరికింకా కొత్తకాబట్టి అలా అవుతున్నారు. ఇక్కడకు వచ్చిన కొత్తలో నేనూ అలాగే భయపడేవాడినండి అమ్మగారు. కాని సంవత్స రాలు గడిచినకొద్దీ అలవాటు పడిపోయి యిప్పుడు ఊళ్లో పులిగానీ, దుమ్మురగుండుగానీ ఏది తిరిగినా భయమే ఉండదుతల్లీ"

"యిక్కడకు పులులుకూడా వస్తాయా శీతయ్యా!"

"అదోమాటాతల్లీ! ఒక్కొక్కప్పుడు ఊరంతా గస్తీ తిరుగుతాయి కూడా"

"అమ్మబాబోయ్! మరి ఎలాగ శీతయ్యా!"

"అలాగేనమ్మా మరి ఏంచేస్తాం. ఇప్పుడు అయ్య గారు మకాంచేసిన బంగళాచుట్టూ పగలూ, రాత్రి కూడా పులులు తిరుగుతునే ఉంటాయి"

"మరేంపరిమాదం రాదుకద శీతయ్యా!"

"ఎంతమాట శెలవిచ్చారు తల్లీ. అలాగైతే ఉద్యోగం చెయ్యగలమా"

"ఏమోశీతయ్యా! నాకు బెంగగా ఉంది."

"పిచ్చితల్లీ! పాపం అయ్యగారు ఏంతప్పిదం చేశారో ఇక్కడకు బదిలీ అయారు. ఆ తప్పిదానికి వారేకాకుండా మీరుకూడా ఇక్కడ బాధపడుతున్నారు పాపం"

"ఆదేమిటి శీతయ్యా అలా అంటున్నావ్"

"అబ్బే ఏం...

"అయ్యగారేదో తప్పు చేశారంటున్నావే"

"అవునమ్మా! లేకపోతే యిక్కడకు బదిలీ చెయ్యరు"

తప్పెవరిదో ఆమెకి యిప్పుడు అర్థమైంది.

ఈ దుస్థితికి అంతకీ తనేకదా కారణం అనుకుంది. తన మూలంగా భర్తకు అప్రతిష్ఠ వస్తున్నాదని భయపడింది.

యీ విధంగా రాజేశ్వరి బాధపడటం యిదే మొదటిసారి.

## 4

వెంకట్రావు క్యాంపునుంచి రాగానే ప్రారంభించింది రాజేశ్వరి.

"ఏమండీ యిల్లూ సంసారం అంతా మరిచిపోయా రేమిటి? యిన్నేసి రోజులు క్యాంపులో ఉండిపోతే ఎలాగండీ"

"వెళ్ళి మూడు రోజులేగా అయింది"

"నామట్టుకు మూడు సంవత్సరాలులా ఉంది. యిక్కడ ఉండడానికి నాకు ఎంత భయం వేసిందను కున్నారు"

"ఏం శీతయ్య రాలేదూ"

"వచ్చేవాడు. అయినా యీ అడివిలో చుట్టూ వక్కలూ, జంతువులూ అనుస్తాంటే"

"మరెలాగ అంతా ఉండటం లేదూ"

'యిక్కడనుంచి ఎప్పుడు బదిలీ చేస్తారండీ''

"సరిసరి నిన్నకాక మొన్నవచ్చాం. అప్పుడే మన నెవరు బదిలీ చేస్తారు. అందులోనూ మనమీద కోపంచాత యిక్కడకు పంపించారన్న విషయం మరచిపోయావా"

"మనమీద కోపానికి మనం ఏం చేశామని"

"రామాయణమంతా విని రాముడికి సీత ఏమౌ తుంది అన్నట్టుంది."

"యిక్కడ ఉండలేం సుమండీ"

"ఏం పోట్లాడిందికి ఎవరూ లేరనా"

"మీ వేళాకోళానికి వేళా, పాళా, సమయం, సంద ర్భం లేనట్టుంది ఉండలేక నే చస్తూంటే వేళాకోళమూ డు తారు మీరు."



యిలా ఆరు నెలలు గడిచాయి.

రాజేశ్వరికి భయం ఒకరోజుకు ఒకరోజు ఎక్కువ అయి శొంగ పెట్టేసుకుంది పెద్దపులులు అరుపులు ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఏవస్తువుని చూసినా దుమ్మలగుండులాగనే కనిపిస్తున్నాది.

ఒకనాడు వెంకటావ్రు క్యాంపునుంచి తిరిగి వచ్చే సరికి రాజేశ్వరి వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చుంది.

భార్య పరిస్థితి కనిపెడుతూన్న వెంకటావ్రుకి ఆరోజున ఆమెలో పూర్తి మార్పు కనుపించింది.

ఆమె పరిస్థితిని చూసి చాలా జాలిపడ్డాడు.

"నేను చచ్చేవరకూ యీ వూరినుంచి కదలరా" అంది.

"నాలుగు రోజులు ఓర్చాలి మరి"

"అవును ఈలోగా ఏ పులో, ఎలుగుబంటో ఈడ్చుకు పోతుంది"

"మరి నన్నేం చెయ్యమన్నావ్, ఇదంతా నువ్వు చేసుకున్నదేగా"

"అందుకనే అనుభవిస్తున్నాను. యీ శిక్షకి అంతం వుందో లేదో" అంది ఏడుస్తూ.

వెంకటాద్రివులో కరుణరసం వెల్లువలై పరుగెత్తింది. యిక ఆమెని అనునయించక ఉండలేకపోయాడు.

"అయితే యిక్కడనుంచి వెళ్ళిపోవాలంటావ్" అన్నాడు.

"అంత అదృష్టం పడితే మరేం కావాలి"

"అయితే అదీ మన చేతుల్లోనే ఉంది."

"నిజంగా నేనాండి" అంది ఆత్రుతతో.

"ఊ! కాని నువ్వు ఒక పని చెయ్యాలి. ఎప్పుడూ ఎవరితోనూ పోట్లాడనూ అని కాయితం రాసి ఇస్తేచాలు"

"కాయితం ఏం ఖర్మం. దస్తావేజు రాసియిమ్మంటే యిస్తాను" అంది.

మరునాడే వెంకటాద్రివు శలవు పెట్టాశాడు.

శలవు, అనంతరం మారోదగ్గరకి బదిలీ అయింది.

♦ ♦ ♦ ♦

కథ అయిపోయింది.

రాజేశ్వరిలో పోట్లాడే స్వభావం పోయిందో లేదో యిప్పుడు నాకు తెలియదు.

కాని ఒక్క విషయం......

రాజేశ్వరిలో సత్పరిణామం వచ్చిందంటే ఆ ఘనత వెంకటాద్రివుది. అతణ్ని నిజమైన సంస్కారి అని చెప్పవచ్చు.

ఆమె పూర్వంలాగనే ఉందంటే అది ఆమెతోడనే పుట్టిన స్వభావం. ఆ స్వభావాన్ని ఎంతటి సంస్కర్త అయినా మార్చలేడు.

ఎప్పుడైనా వాళ్లు మీకు తారసిల్లినప్పుడు—

గెలుపు వెంకటాద్రివుది అయితే అతన్ని అభినందించండి.

లేకపోతే రాజేశ్వరిపై సానుభూతి చూపండి. కాని ఆమెని తిట్టకండి.



# ప్రేమకోసమై ★★★★

ఆమె ఒళ్లు ఝుళిపించిందో, కళ్ళు మెరిపించిందో తెలియదు కాని రామనాథానికి మాత్రం ఒళ్లు పులకించింది.

కాలమానం ప్రకారం నియమబద్ధంగా పనులు నిర్వహించాలని సప్లయి చెయ్యబడ్డ బిగ్ బెన్ ఎప్పుడో, ఎందుకో పెట్టిన అలారాన్ని కొట్టింది.

రామనాథం తుళ్ళిపడి అటూ యిటూ చూశాడు. తన ముందు టేబిలూ, టేబిలు మీద తనకోసం ఎదురు చూస్తున్న కాయితాలూ, పక్కని పిజిన్ హోల్ అల్మయిరా, అందులోంచి తొంగి తొంగి చూస్తున్న కాయితాలూ, ఎదురుగా రికార్డు రాకులూ, రికార్డు రాకుల్లో బూజుపట్టిన పాతకాయితాల కట్టలూ కనుపించేసరికి తడబాటు ఎడబాటై రామనాథం గుమాస్తా రామనాథం అయాడు.

రామనాథం ప్రేమ వ్యవహారాల్లో ఆరితేరిన ఘటం కాడు. అవివాహితుడు. ఆమాటకొస్తే అచ్చంగా బ్రహ్మచారి.

కష్టపడి స్కూల్ ఫైనల్ ప్యాసై, సర్వీసు కమిషన్ కూడా ప్యాసై ఉద్యోగంలో చేరాడు. ఆవూరు కొత్త, ఆ ఉద్యోగంలో కూడా కొత్తగా అదే ప్రవేశించడం. ఇంకా పూర్తిగా రెండు నెలలు కూడా కాలేదు. హోటల్లో భోజనం, చిన్న అద్దెగదిలో ఉనికి.

ఆఫీసు వేళ పదకొండు గంటల నుంచి అయిదు గంటల వరకూ అయినా, వారి సౌకర్యార్థమో లేక ప్రజల సౌకర్యార్థమో ఏనాడో ఎవడో ప్రొద్దుట ఉదయం ఎనిమిది గంటల నుంచి పదకొండు గంటలవరకున్నూ, మధ్యాహ్నం రెండు గంటల నుంచి సాయంత్రం అయిదు గంటల వరకున్నూ పనిచేసిన అలవాటు సాంప్రదాయ సిద్ధమై తరువాత వచ్చిన వారికి కూడా అదే వేళల్లో పని చేయడం పరిపాటైంది.

రామనాథం ఆఫీసుని తనే విప్పుకోవాలి. ఆఫీసుకు ఉన్న యిద్దరు బంట్రోతులూ ఆఫీసరుగారి యింటిదగ్గరే వుండి వారి స్వంత పనులు చేస్తూండడం అలవాటు. రోజుకు ఒకసారి ఏదో ఒక వేళలో మాత్రం రామనాథానికి బంట్రోతుల దర్శనం దొరుకుతుంది. ఆఫీసు తెరిచే వేళలో వాళ్ళ దర్శనం దొరకదు. అందులోనూ ఉదయం మరీన్నీ. ఒక బంట్రోతు ఆఫీసరుగారి పిల్లల్ని ఎత్తుకుంటే మరొకడు బజారుకి కూరగాయలు కొనడానికి పోతాడు. అందుచేత రామనాథం— రామనాథం అన్న మాటే ఏమిటి అక్కడ అతను చేస్తున్న పని చేసే ప్రతి వాడూ— ఆఫీసు తాళంతీసి తలుపులు తెరుచుకుని, కిటికీలుకూడా విప్పుకోవాలి. ఆఫీసు నిత్యజీవితానికి అను నిత్య ప్రారంభోత్సవం ఆపని.

అటూ యిటూ చూశాడు రామనాథం. ఎవరూ లేరు. కిటికీ దగ్గరకు వెళ్ళి కిటికీలోంచి తొంగిచూశాడు తను పడ్డ తడబాటులో ఎంత విలంబన జరిగినదీ కూడా అతనికి గుర్తులేదు. ఆమె కనిపిస్తుందేమో అని చూశాడు.

కాని యీపాటికి ఆమె హైస్కూలు చేరి ఉంటుంది. తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. ఏవో కాయితాలు తీశాడు. కాయితాలు బరువెక్కిపోయాయి. అందులో అక్షరాలు వెగటుగా కనిపించాయి. పనిమీదికి బుద్ధి పోవటంలేదు. అంతా నీరసంగానూ, నిద్రాణంగానూ కన్పిస్తోంది. ఇదంతటికీ కారణం ఆమే అనుకున్నాడు రామనాథం.

ఆమె ఎవరో మాత్రం రామనాథానికి తెలియదు. రోజూ తను ఆఫీసు విప్పుకుని కూర్చున్న వేళకే ఆమె కూడా ఆఫీసు పక్కనుంచే వెళుతూంటుంది. పరధ్యానంగా చూసేవాడు ఆమె అలాగే వెళ్లటం. ఆమె వెంట ఒక అబ్బాయి కూడా వెళ్లడం అతనికి బాగా తెలుసు. చేతిలో పుస్తకాలు పట్టుకుని రోజూ వెళ్ళటం నుంచి ఆమె చదువుకుందికి స్కూలుకి వెళుతోందని మాత్రం రామనాథానికి తెలుసు. అంతేకాని ఆమె ఏమి చదువుతున్నదీ అతనికి తెలియదు. ఆరోజు వరకూ యీ వివరాలు తెలుసుకోవాలన్న కుతూహలం కూడా అతనికి కలగలేదు. కాని ఆరోజుమాత్రం, ఆమె చూపుల్లో ఎంత తీక్ష్ణత ఉందో మరి తెలియదుకాని, రామనాథానికి ఆమె వివరాలు తెల్సుకుంటే బాగుణ్ణనే బుద్ధి పుట్టింది. ఆ చూపు తిరిగి గుర్తుకి వచ్చేసరికి ఏవో సినిమాలు జ్ఞప్తికి వచ్చాయి అతనికి. ముక్కూ మొహం తెలియని అమ్మాయీ, అబ్బాయీ యీలాగే మొట్టమొదటిసారి ఏ నీళ్ళబావి దగ్గరో, లేక ఏ కాలిబాట మీదనో చూసుకుని తరువాత కథ నడుస్తున్నకొద్దీ హీరో హీరోయిన్‌లు

అయిపోతారు. ఇలాంటి సినిమాలు చాలా చూశాడు అతను.

ఆ వేళకు పదిహేను సంవత్సరాలూ, అబ్బాయికి పన్నెండు సంవత్సరాలూ, ఉంటాయని అంచనా వేశాడు. బహుశా ఆ అమ్మాయికి తమ్ముడై ఉంటాడు. అమ్మాయి సిక్స్తుఫారం, అబ్బాయి థర్డుఫారం చదువుతూ ఉంటారనుకున్నాడు. చూపుల్ని బట్టి ఆమె స్కూల్లో ఏవరేజికి తక్కువ ఉండకూడదనుకున్నాడు. కుర్రవాడి తెలివి తేటల్ని అంచనా వేయటంలో అతనేం శ్రద్ధ తీసుకోలేదు. ఇక ఆమె అందం విషయంలో ఆమెలో ఏమీ కురూపి తనం కనిపించలేదు అతనికి. ఆమె అందం అతనికి సంతృప్తికరంగానే ఉంది. బ్యూటీ పెర్సంటేజి ఎంతో అతను నిర్ణయించలేక పోయాడు.

వెంకటేశ శాస్త్రి, మూర్తి అనేవాళ్ళు రోడ్లంట తిరుగుతున్నప్పుడు కనుపించే అమ్మాయిలకు బ్యూటీ పెర్సంటేజి కట్టేవారని అతనికి ఏమిత్రుడో చెప్పగా విన్నాడు. అప్పుడు ఆ విషయమై అతనేమీ పట్టించుకో లేదు. గాని ఇప్పుడు తన మిత్రుడు చెప్పింది జ్ఞాపకం తెచ్చుకో సాగాడు. సాధారణంగా అందరికీ మల్లే ముఖం చూసి మాత్రమే వాళ్లు అందాన్ని నిర్ణయించే వాళ్ళు కాదట. ముఖం అంతటికీ మొత్తం ఇరవై మార్కులట, [illegible] ఐదూ, కళ్లకి అయిదూ, పళ్లకి నాలుగూ, నవ్వుకి మూడూ, పెదవులకి మూడు మార్కులుట. మిగతా ఏడూ శరీర భాగాల్లోనూ రొమ్ముకి కొన్ని మార్కులూ, నడ్డికి కొన్ని, చేతులకి కొన్ని, కాళ్ళకి కొన్ని,

బడికి కొన్ని, నడకకు కొన్ని మార్కులు నిర్ణయించి మొత్తం బ్యూటీ పెర్సంటేజి యింతా అని నిర్ణయించే వారుట. ఆ లెక్కలలో యీ మెకు ఎన్ని మార్కులు వస్తాయో? పాస్ మార్కులకి లోపం ఉండదనుకున్నాడు. ఇంతకీ ఆమె ఎందుకు అలా చూసిందో. పాపం రోజూ అలాగే చూస్తోందేమో! రోజూ ఆవిషయం తను గమనించలేక పోయినందుకు విచారించుకున్నాడు. కొంపతీసి ఆమె తనని ప్రేమించలేదు కద! చప్పున ఆగి పోయాడు రామనాథం. ఆమె ఎవరో, ఏ కులమో, అంతస్తు ఎలాటిదో యెవరికి తెలుసు? ఇలాటి ఆలోచన లతో మధ్యని ఎందుకో గడియారం చూశాడు. పదకొండు దాటిపోయింది. ఆ పూట శ్రీరామ చుట్టిన పాపాన్ని పోలేదు రామనాథం.

* * * *

రోజులు గడుస్తున్నాయి. రామనాథం రోజూ ఆ అమ్మాయివైపు చూస్తున్నాడు. ఆమె ఒక రోజున తన వైపు చూసినట్టూ, మరొకసారి చూడనట్టూ, ఒకసారి పెదవులమీద చిరునవ్వు ఒలికిస్తూ, మరో సారి మూతి బిగించుకునీ వెళుతూండేది. ఆమె తన వైపు చూడకుండా వెళ్ళిపోయిననాడు స్కూలుకి టైం అయిపోవడం నుంచి తొందరగా వెళ్ళిపోతోందని, మూతి బిగించుకుని వెళ్లిన నాడు యింట్లో అమ్మతోనో, నాన్నతోనో లేక అమ్మమ్మ తోనో పోట్లాడి ఉంటుందనీ అనుకునేవాడు రామనాథం.

ఒకరోజున అమాంతంగా ఆ అమ్మాయి వెనకాల వెళ్ళే అబ్బాయి రామనాథం దగ్గరకి వచ్చాడు.

రామనాథం నిజంగా పొంగిపోయాడు. ఆమె ఎందుకో పంపించింది అనుకున్నాడు. ఏదో రాయబారం! ఏమిటో ఆ సందేశం! బహుశా ఎక్కడికైనా రమ్మంటుందేమో! ఏదో తెలియని సంతోషంతో తన్మయుడైపోయాడు.

'ఏం అబ్బాయ్' అన్నాడు.

'మీ ఆఫీసులో ఒక పెన్సిలుంటే యిస్తారా' అన్నాడు కుర్రవాడు.

రామనాథం గబగబలేచి వెళ్ళి స్టేషనరీ బీరువా తాళంతీసి ఒక పెన్సిల్ తీసి యిచ్చాడు.

యివ్వడమే తడవుగా పారిపోయాడు కుర్రాడు.

బహుశా ఆమె తనని అడగమని కుర్రాణ్ణి పంపించింది అనుకున్నాడు రామనాథం.

ఆమె ఎవరో, ఏం చదువుతోందో, ఏం పేరో ఆకుర్రాడి దగ్గర కనుక్కుని తెలుసుకోలేక పోయినందుకు విచారించాడు. కర్ణుని అస్త్రవిద్యల్లే సమయానికి పనిచెయ్యకుండా ఉంది తన మెదడు అనుకున్నాడు. సరే యీ మాటు రాకపోతాడా అప్పుడు కనుక్కోలేక పోతానా అనుకుని సముదాయించుకున్నాడు.

రామనాథం అనుకున్నట్టే ఆకుర్రాడు నాలుగైదు రోజులు పోయాక మళ్లీ వచ్చాడు.

ఈసారి కాయితాలు యిమ్మనమని అడిగాడు

రామనాథం కాయితాలు యిచ్చి అడిగాడు "రోజూ నీతో వెళుతున్న అమ్మాయి పేరు" ఏమిటని.

'కామిని' అన్నాడు కుర్రాడు.

'కామిని' చాలా బాగుంది యీపేరు. మూడు అక్షరాలుగల పేర్లు సాధారణంగా బాగుంటాయను కున్నాడు రామనాథం— నర్గీసూ, సురయ్యా, అంజలీ, సావిత్రీ, జానకీ మాలతీ, జమునా, సరోజా, లలితా, పద్మినీ—అబ్బో చాలామంది ఉన్నారనుకున్నాడు.

సినీతారలు కూడా ఏమంత అందంగా ఉండరు. మేకప్‌మాన్ కరుణాకటాక్షం వల్ల తెరమీద అలా కనుపిస్తారు కాని, మామూలుగా యింటిదగ్గర చూస్తే మనల్లే ఉంటారు. వాళ్ళ దర్శనం మనకు తెరమీదగాని లభ్యం అవడం దుర్లభం కనుక వాళ్ల అసలు ఆకారం తెలియక ఆమేకప్ ఆకారాన్నే మనం దృష్టిలో పెట్టుకుని విలువల్ని కట్టేస్తాం. కామినికి కూడా మేకప్ చేస్తే ఎంత బాగుంటుందో అనుకున్నాడు. ఈ ఆలోచనలో ఆ కుర్రవాడు సన్నసన్నంగా ఎప్పుడు జారిపోయాడో రామనాథానికి తెలియలేదు. తను అడగవల్సిన ప్రశ్నలు చాలా ఉంటూండగానే వెళ్ళిపోయాడే సరే మళ్ళీ రాక పోతాడా అనుకున్నాడు.

కొద్దిరోజులుపోయాక ఆ కుర్రవాడు మళ్ళీ వచ్చాడు.

'నీ పేరేమిటోయ్?' అని అడిగాడు రామనాథం.

'కృష్ణారావ్' అన్నాడు.

'ఏమిటి చదువుతున్నావ్?'

'ఫోర్తుఫారం'

'కామినీ ?'

'స్కూల్ ఫైనల్ పరీక్షలు అయిపోయాయి'

'బాగా చదువుతున్నావా'

'ఓ! ఈరోజుతో మాకూ పరీక్షలుసరి'

మరేం అడగాలో రామనాధానికి తొందరగా స్ఫురించక "ఏం యిలావచ్చావ్" అన్నాడు.

"ఇప్పుడు అర్జంటుగా ఓ అయిదు రూపాయలు అవసరం వచ్చిందండి. మీదగ్గరుంటే అడిగి తీసుకు రమ్మంది నాఅక్క. మాకు డబ్బు వచ్చిన వెంటనే మీ అయిదు రూపాయలు మీకు యిచ్చేస్తానని చెప్పమంది" అన్నాడు.

రామనాధం కాస్త ఆలోచించాడు. తనదగ్గర పది రూపాయిలే ఉన్నాయి. జీతం అందటానికి ఇంకా పది రోజులవుతుంది. అయిదు రూపాయలు వాడికి యిచ్చేస్తే తన ఖర్చుకి జీతం అందేవరకూ చాలదు. కాని యివ్వక పోతే కామిని ఏమనుకుంటుంది. అయిదు రూపాయలకు మొహం చూసుకున్నవాడివి ప్రేమించే దేమిటి అను కుంటుందేమో. అవసరమైతే తనమట్టుకి ఎక్కడో అప్పో సప్పో చేసుకోవచ్చు ననుకుని అయిదు రూపాయిలు ఆ కుర్రవాడి చేతిలో పెట్టాడు.

'ఈవాళ మంచి సినీమా వచ్చిందండి'

అన్నాడు కుర్రాడు.

'ఏం సినీమా'

'ప్రేమలేఖలు. చాలా బాగుంటుందిట'

'వెళదామంటావేంటి?'

'నాదగ్గర డబ్బులేదు'

'పోనీ నేను తీసుకువెళతాను వస్తావా'

'ఆ'

'కాని మీ కామినిని కూడా తీసుకు రావాలి'

'ఓ'

'అయితే నువ్వూ, కామినీ సినిమాహాలు దగ్గరకు రండి ఆరుగంటలకు. నేను హాలుదగ్గర మీ కోసం చూస్తూంటాను

'ఆం'

'తప్పకుండా వస్తారుకదూ'

'ఓ' అంటూ కుర్రాడు వెళ్ళిపోయాడు

ఎప్పుడు సాయంత్రం అవుతుందా అని గంటలు లెక్క పెట్టుకుంటూ కూర్చున్నాడు రామనాథం. నాలుగ్గంటలు కాగానే టాయిలెట్టవడానికి ప్రారంభించి అయిదు గంటలకి పూర్తి చేశాడు. సినిమానుంచి తిరిగి వచ్చేసరికి హోటలువాడు భోజనం ఉంచుతాడో ఉంచడో అని కడుపునిండా టిఫిన్ తినేసి ఆరు అయేసరికి సినిమా హాలుకి చేరుకున్నాడు.

ఆరు......ఆరుంపావు......ఆరున్నర కూడా అయిపోయింది...కామిని రాలేదు. కనీసం ఆ కుర్రాడైనా రాలేదు. సినిమా ప్రారంభించారు. ఇంకా వస్తారేమోనని ఏడు గంటలవరకూ కూడా చూశాడు. కాని వాళ్ళు రాలేదు. నిరాశతో కాళ్ళు యీడ్చుకుంటూ, వాళ్ళు

రాకపోవడానికి కారణాలు ఆలోచించుకుంటూ లాడ్జికి తీరివేశాడు.

మర్నాడు ఉదయం కాస్త ముందుగా ఆఫీసుకు వెళ్ళాడు రామనాథం. ఆ కుర్రాడు కనిపిస్తే నిన్నను ఎందుకు సినిమాకు రాలేదో కనుక్కుందామనుకున్నాడు. కాని ఆకుర్రాడు ఆపూట కనుపించలేదు మధ్యాహ్నం కూడా కనుపించలేదు.

నాలుగైదురోజులు గడిచాయి కాని కుర్రవాడు గాని, కామినిగాని ఎక్కడా కనుపించలేదు. ఏమైపోయారా అనుకున్నాడు రామనాథం. ఎవర్నయినా అడుగుదామంటే వాళ్ళవూసు నీకెందుకయ్యా వాళ్ళకూ నీకూఉన్న సంబంధం ఏమిటని అడుగుతారేమో అని భయపడి ఎవర్నీ అడగలేక పోయాడు.

ఒకనాడు మధ్యాన్నం ఆఫీసు ప్రక్క నుంచి కామిని వెళ్ళటం చూశాడు రామనాథం. ఇటూ అటూ చూశాడు. ఎవరూలేరు. గబగబా వెళ్ళాడు ఆమెదగ్గరికి.

'చూడండి' అన్నాడు.

ఆమె ఆగకుండా వెళ్ళిపోతోంది.

'మిమ్మల్నే' అన్నాడు.

అయినా ఆమె ఆగలేదుగాని మెల్లిగా అడుగులు వేస్తోంది.

'ఇదుగో...మీతో ఒకమాట'

ఆమె ఆగి యిటు తిరిగింది.

అంతవరకూ రామనాథంలో ఉన్న ధైర్యం ఆమె తనవైపు తిరగ్గానే సన్నగిల్లి సాగింది. గుండెలు గట్టిగా కొట్టుకుంటున్నాయి. మాట రావడం కష్టంగా ఉంది. కాని ధైర్యం తెచ్చుకుని,

'మీ తమ్ముడేడి'

'మా తమ్ముడెవడు'

'రోజూ మీ వెనకాల వెళ్ళే కుర్రాడు. కృష్ణరావు'

'వాడా! శలవలకి వెళ్ళిపోయాడు'

'ఎప్పుడు వస్తాడు'

'మరి రాడు'

రామనాథానికేమీ అర్థంకాలేదు. తెగించి అన్నాడు.

'ఆరోజు మీరు సినిమాకి వస్తారని కళ్లు కాయలు కాచేటట్టు చూశాను.'

'మీరు అంటున్నదేమిటో నాకు అర్థమవలేదు'

రామనాథానికి కోపం వచ్చింది.

'నాకు యిప్పుడు అవసరముంది. బదులు తీసుకు వెళ్ళిన ఐదు రూపాయిలూ యిస్తారా'

'మీరు ఎవరితో మాట్లాడుతున్నారో ఒళ్లు దగ్గర పెట్టుకుని మరీ మాట్లాడండి' అంటూ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

ఆమె కళ్ళు ఝుళిపించిందో లేక బుజ్జ పంకించిందో తెలియదు కాని రామనాథానికి ఒళ్లు కంపించింది.



# అన్నపూర్ణ

అన్నపూర్ణాదేవి పూజామందిరంలోంచి చిరుగంట మోగేసరికి విశాలాక్షి, సాంబశివమూర్తి పూజామందిరము లోనికి వచ్చారు.

సపర్యల్ని పూర్తి చేసి గౌరీశంకరులకు హారతి యిచ్చి అత్తమామలకు కూడా యిచ్చి తనూ పుచ్చుకుంది. భగవన్నివేదితమైన ప్రసాదాన్నీ, పూజాపుష్పాల్నీ వృద్ధ దంపతులకిచ్చి తనూ స్వీకరించింది.

విశాలాక్షి, సాంబశివమూర్తి వెళ్ళిపోయారు.

గౌరీశంకరుల పాదాలవద్ద ఫాలాన్ని మోపి, స్థాణువై కన్నీళ్ళు కాల్వలు కట్టేటట్లు ఏడ్వసాగింది.

ఇది ఆమె దినచర్యలో ఒక భాగం. శ్రావణ వర్ష మేఘంవంటి ఆమె హృదయంలో ఎంత కన్నీరుందో మరి!

'ఎంతకని అలా ఏడుస్తావు తల్లీ! లే! మీవల్ల సుఖ పడవలసిన యీరోజుల్లో విచారభారాన్ని నెత్తినివేశాడు భగవంతుడు. దురదృష్టవంతులం. పాపి చిరాయుః అని యింకా ఎన్నాళ్ళు నీకష్టాల్ని చూడవలసి ఉంటుందో' అని అత్తమామ లంటూండడం, అన్నపూర్ణ కాస్త శాంతి పడటంకూడా దైనికచర్యలే.

'వంశమర్యాదల్ని నాశనం చెయ్యడానికి పుట్టాడు. పిల్లలని ఎంత ముచ్చటపడ్డామో అంత ఆనందం అయింది వీడేదో ఉద్ధరిస్తాడను కున్నాంగాని మమ్మల్ని రచ్చలోని

క్కి తలఎత్తుకు తిరగకుండా చేస్తాడని ఎప్పుడూ ఊహించుకోలేదు. మహాత్ముడు! దురాత్ముడు! అని సాంబశివమూర్తి అంటున్నప్పుడల్లా క్షమించండి మామగారూ! వారి ననడం ఎందుకు? యిదంతా నా అభాగ్యం యీ కష్టాలన్నింటికీ నేనే కారణం' అంటూ ఏడుస్తుంది.

*　　*　　*　　*

అన్నపూర్ణాదేవి, విశ్వనాథం, ఏనాడూ గట్టిగా మాట్లాడకున్నైనా ఎరగరు. వారిది ఆదర్శమైన దాంపత్యంగా ఉండేది. భార్యాభర్త లిద్దరూకూడా కోటీశ్వరుల బిడ్డలే అవటంచేత జీవితావసరాల్లో ఏవిధమైన లోటూ లేదు. అందుచేత విశ్వనాథానికి అకస్మాత్తుగా భార్యపై అయిష్టత కలగడానికి ఏవిధమైన కారణం కనుపించదు అలా అని భార్య కురూపీకాదు దీర్ఘరోగికాదు. ముభావంగా కొన్నాళ్ళుగడిపి ఒకనాటిరాత్రి యిల్లువిడిచి వెళ్లిపోయాడు.

ఈ విషయం తెలిసేసరికి ఊళ్ళో సంచలనం కలుగక పోలేదు. కాని అన్నపూర్ణాదేవి, విశ్వనాథాల్లో ఎవరిది తప్పో తెలుసుకోలేక పోతున్నారు.

కడుపులో పుండు పుట్టడం వల్ల కొద్దిరోజుల క్రిందటే పెద్ద ఆపరేషన్ చేయించుకుంది అన్నపూర్ణాదేవి. ఆమె కింకా పూర్తి ఆరోగ్యం చేకూరనేలేదు. అటువంటి సమయంలో యీ సంఘటన జరిగేసరికి ఆమెకి మనోవ్యాధి రావటంలో ఆశ్చర్యం ఏముంది!

భర్త ఆవిధంగా చేయడానికి ఏం కారణమై ఉంటుందా అని ఎన్నో విధాల ఆమె వితర్కించుకుంది కాని ఆమెకి ఏకారణం కనుపించలేదు.

ఆ మనోవ్యాధితో ఆమె భక్తి ఉద్రిక్తమైంది. అనారోగ్యమైనా లెక్క చెయ్యకుండా స్నానం, ధ్యానం, పూజా, పురస్కారం వీటిలోనే నిమగ్నమయింది.

'నామనస్సు బాగులేక పోవడంనుంచి, శాంతిని అన్వేషిద్దామని బయలుదేరాను. మీకు తెలియకుండా బయలుదేరినందుకు క్షమించాలి. నేను తిరిగి ఎప్పుడు వచ్చేదీ నిశ్చయంగా చెప్పలేను. తెచ్చుకున్న డబ్బు అయిపోయింది. వెంటనే అయిదు వందల రూపాయలు పంపగలందులకు ప్రార్థిస్తున్నాను.'

కాశీనుంచి కొడుకు వ్రాసిన పై ఉత్తరం చదివేసరికి సాంబశివమూర్తికి కొడుకు క్షేమంగా ఉన్నందుకు సంతోషమూ, యీవిధంగా మారినందుకు విచారం కలిగాయి. భార్యకీ, కోడలుకీ చెప్పాడు యీవిషయం.

'వెంటనే రమ్మని వ్రాయండి. అక్కడేం యిబ్బందులు పడుతున్నాడో! వేళపట్టున తిండా, తిప్పా; కాలు నొచ్చినా చెయ్యి నొచ్చినా చూసేవారెవరు! వెంటనే రమ్మని వ్రాయండి. డబ్బుమాత్రం పంపకండి. అది అయిపోయేవరకూ రాడు'—అంది విశాలాక్షి.

అన్నపూర్ణకి ఏమనాలోకూడా పాలుపోలేదు. ఆమె కళ్ళంట మాత్రం నీళ్ళు తిరుగుతున్నాయి. చరచరా వెళ్ళి కలం కాయితం తెచ్చి మామగారికిచ్చింది.

భార్య చెప్పిన ప్రకారమే ఉత్తరం వ్రాసి, కాశీనుంచి యింటికి రావడానికి సరిపోయే ఖర్చులు మాత్రమే పంపించాడు సాంబశివమూర్తి.

భర్తని వేగం యింటికి రప్పించు తంతి) అని అన్నపూర్ణ అవిరళధ్యానంలో మునిగింది.

ఎప్పుడొస్తాడా అని తల్లిదండ్రులు ఎదురు చూస్తున్నారు.

'మీ కుమారుడు వారణాసీ పురవీధుల్లో భిక్షకుడు కాకుండా ఉండాలంటే నేను కోరిన ప్రకారం డబ్బు పంపిస్తారు.' అని వ్రాసిన కొడుకు ఉత్తరానికి సాంబశివమూర్తికి విచారాన్ని మించిన కోపంవచ్చింది. కొడుక్కి పిచ్చిగాని ఎత్తిందా అని అనుమానం కలిగింది. వంశ మర్యాదలు వీధులంట పరుగెడుతున్నందుకు చాలా విచారించాడు.

'మీరు వెళ్ళి తీసుకురండి' అని భార్య చెప్పిన సలహానను సరించి కాశీకి బయలుదేరాడు సాంబశివమూర్తి.

* * * *

'వాళ్ళ యింటిదగ్గర జరక్కరారు మన యింటికి, మనకి యివ్వడం సాంప్రదాయం. మన యింటిదగ్గర ఉండడం మర్యాద. పోనీ నువ్వే ఆలోచించు, దానికి పుట్టింట ఏవిధమైన లోపం ఉందా? మన యింటికి ఎందుకు వస్తుంది చెప్పు? డబ్బు కోసమా? మర్యాద కోసమా? పెండ్లియై, పెద్దమనిషియైన స్త్రీ పుట్టింట ఉండడం మర్యాదా కాదు. అలాగే ఉంటే పుట్టింటి వారికీ, అత్తింటివారికీ ఎంత అగౌరవమో ఆలోచించు. పోనీ అది చేసిన తప్పు ఏమైనా ఉంటే చెప్పు. అంతే

కాని అకారణంగా నీవు చేసిన యీపని నేనే కాదు, ఎవరూ హర్షించరు. లే, పద'

'.........'

'ప్రొజ్జడ ఏచేవనే అనుకుంటున్నాను కాని యీ విధంగా మారుతావని ఎన్నడూ కలలోనైనా ఊహించుకోలేదు.'

'క్షమించండి నాన్నగారు! తిరిగీ అక్కడకు వచ్చేందుకు నామనస్సు యిష్టపడకుండా ఉంది!'

'ఇన్నాళ్ళూ ఉన్న యిష్టం యిప్పుడొక్కసారి మారిపోవడానికి కారణం.'

'చెప్పలేను.'

'ఏకారణం లేకుండా యిలాంటి పనిచేస్తే పిచ్చి ఎక్కి ఉండాలి.'

'మీ రేమన్నా పడతాను'

'ఇంత మూర్ఖుడవని ఎన్నడూ అనుకోలేదు.'

'అది ఉన్నన్నాళ్ళు నేను రాలేను.'

'కారణం.'

'..............'

'దానిలో ఫలానా లోపముంది, లేక ఫలానా తప్పు చేసింది అని నిరూపించు.'

'...............'

'పోనీ నిరూపించవ నవసరం లేదు చెప్పు, అది ఏం తప్పు చేసిందో.'

'అదేం తప్పు చెయ్యలేదు'

'మరి......'

'....................'

'అన్యాయంగా, అకారణంగా మమ్మల్ని, దానినీ ఎందుకిలా ఏడిపించడం?'

'అది నాకింక భార్యగా పనికిరాదు.'

'ఊహాగానం చేస్తున్నావా, లేక ఎవరైనా చెప్పారా?'

'చెప్పారు'

'ఎవడా మూర్ఖుడు?'

'డాక్టరు'

'ఏ డాక్టరు?'

'దానికి ఆపరేషన్ చేసిన డాక్టరు'.

'ఏమని చెప్పాడు'

'ఆమె భర్తకి పనికిరాదని చెప్పాడు.'

'మరిఆసంగతి అక్కడ మాతో ఎందుకు చెప్పలేదు?'

'చెప్పి ఏం ప్రయోజనం?'

'చెప్పితే యీపాటికి మరోభార్యతో కాపురం చేస్తూండే వాడివి.'

'అది ఉంటూండగానే.'

'ఆ! అందులో తప్పేముంది? హిందూ ధర్మశాస్త్ర ప్రకారం బహుభార్యాత్వం నిషేధం కాదే. తన అంగ

బలాన్నీ, అర్ధబలాన్నీ చూసుకొని ఎన్ని వివాహాలైనా చేసుకోవచ్చు పురుషుడు.'

'ఆమెకి అన్యాయం......'

'నువ్వే అన్యాయం చెయ్యడమేంటి. ఆమెకి భగవంతుడే చేశాడు. కాకపోయినా నువ్వు యీ విధంగా వేశాలుపట్టడం న్యాయంగా ఉందా ఏమిటి?'

'.................'

'పిచ్చి పిచ్చి ఆలోచనలు మాని బయలుదేరు.'

ట్రైన్ కదలుతోంది. అంతవరకూ తనతో ఉన్న కొడుకు మాయమయేసరికి సాంబశివమూర్తి గాభరా పడ్డాడు. దిగిపోదా మనుకున్నాడు. కాని బండి నడుస్తోంది. కొడుకు చేసిన మోసాన్ని దూషించుకుంటూ, అస్థిమితమైన మనస్సుతో ఒక మూల కూలబడ్డాడు.

సాంబశివమూర్తి యింటికి చేరిన మర్నాడే విశ్వనాథం దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. తన భార్య బ్రతికి ఉన్నన్నాళ్లూ తాను యింటికి రానని వ్రాశాడు. విశాలాక్షి, సాంబశివమూర్తి చాలా దుఃఖపడ్డారు.

ఆ విషయం అన్నపూర్ణకి తెలియనియ్యలేదు.

*   *   *   *

తెలివైనవాడు ఒక తప్పుపని చేసిన తరువాత దాని విషయమై ఆవేదన పొందకపోడు. మనోధైర్యాన్ని కోల్పోతూ విశ్వనాథం పిచ్చివాడల్లే గయా, ప్రయాగ, హృషీకేశం, బదరీనారాయణం మొదలైన

పుణ్యక్షేత్రాలు తిరిగాడు. మహాపురుషుల్ని సందర్శించాడు. యీ విధంగా ఒక సంవత్సరం ఆధ్యాత్మిక వాతావరణంలో తిరిగేసరికి ఆతనిలో ఎంతో మార్పు వచ్చింది. జీవితాన్ని కొన్ని నియమాలమీద నడిపించడం అలవాటు చేసుకున్నాడు. ఒంటరిగా కూర్చొని తను చేసిన అపరాధాల్ని తలుచుకుని ఏడ్చేవాడు. ఈ పరిస్థితుల్లో తను భార్యకు చేసిన అపచారం జ్ఞాపకం వచ్చింది. తనవల్ల ఆమె ఎంతబాధ పడుతోందో అను కున్నాడు. ఆమె దగ్గరకు వెళ్లి క్షమాపణ వేడుకుందా మనుకున్నాడు; కాని ఆత్మగౌరవం అనేది అతనిలో పూర్తిగా నశించకపోవడంవల్ల ధైర్యంగా యింటికి బయలు దేరలేక పోయాడు.

మనోవ్యాధితో మంచంపట్టి కుమిలి కృశించి పోతూన్న అన్నపూర్ణకి విశ్వనాధం వ్రాసిన పుత్తరం దొరికితే చదువుకుంది. 'నేను చనిపోతేగాని వారు తిరిగి రారుట. అలాంటప్పుడు నేను బ్రతికిఉండడం ఎందుకు? వేగం తీసుకుపో భగవంతుడా! ఎలాగైనావారు తిరిగివచ్చి తల్లిదండ్రులకైనా కాస్త ఆనందాన్ని యిస్తారు! అనుకుని ఎంతో ఏడ్చింది. ఆఏడుపుతో తెలివితప్పి పడిపోయింది.

వ్యాధినుండి తెముల్లుకోలేక రోజుకురోజూ క్షీణించి పోతూ మరణశయ్యమీద ఉంది అన్నపూర్ణ. డాక్టరు పెదవులు విరచాడు. ఆమె మరణ యాతన పడుతోంది.

అలాంటి విషాదపరిస్థితిలో విశ్వనాధం ఆత్రంగా వచ్చాడు. పరిస్థితిని గమనించేసరికి అతనిలో ఆందోళన తుపానువలె చెలరేగింది.

'అన్నపూర్ణా! అన్నపూర్ణా!, అని వెర్రి పిలుపు పిలిచి, ఆమె పక్కని కూర్చొని ఆమె తలను తన తొడ మీద పెట్టుకున్నాడు.

[illegible]సంతో కొద్దిగా కళ్లువిప్పి భర్త ముఖం చూసింది.

ఆమె కళ్ళంట నీళ్ళు గిరగిరా తిరిగాయి.

[illegible]సంతో ఏమీ చెప్పలేకపోయింది.

నీళ్లు తిరుగుతూన్నా కళ్లు మూతలు పడిపోయాయి.



# ఇంటాయన కనీసపు కోర్కెలు.

""సుబ్రిమణ్యం!" అని కేకవేశాను వెయిటింగ్ రూంలోంచి -- ప్లాట్‌ఫారంమీద పేపరు చదువుతూ వెళుతూన్న సుబ్రిహ్మణ్యాన్ని.

"ఓహో! మూర్తీ! ఏమిటి ఎక్కడకు వెళుతున్నావు. ఏమిటి కథ. చాలారోజులకి కనిపించావోయ్. అంతా క్షేమమా!"

"ఏదో యిప్పటి కిలాఉన్నాం. కొద్దిగా పనిమీద బరంపురం వెళ్లి తిరిగి వస్తున్నా. ఇంకా నువ్వు మహా పట్నంలోనే ఉంటున్నా వనుకుంటున్నాను."

"శని విరగడైంది బ్రదర్! నువ్వు వెళ్ళిన రెండు నెలలకే యిక్కడకు వచ్చేశాను."

"అన్నట్టు మరచిపోయాను. అప్పటి యింటి సంగతి ఏమయింది?"

"అబ్బో చాలాఉంది కథ. రా, కొద్దిగా టీ తాగి కూర్చుందాం. మరో గంటకిగాని మీ బండిరాదులే."

* * * *

సుబ్రిహ్మణ్యం చాలా సరదా అయినవాడు. అయిదు సంవత్సరాల క్రిందట మహాపట్నంలో చురుగ్గా యిళ్ళకోసం ప్రయత్నించే వాళ్లల్లో నేనొకణ్ణి సుబ్రిహ్మణ్యొ ఒకడున్నూ. అష్టమైన వీధులూ అనునిత్యం తిరగడంలో సుబ్రిహ్మణ్యం తారసిల్లాడు. గూడు లేని

మా యిద్దరికీ స్నేహం బాగా అయింది. తరువాత మా యిద్దరికీ ఒక గదికోసరం కూడా ప్రయత్నించాం. కాని మొత్త ప్రయత్నించినా ఫలితం లేక పోయింది. లేవ గానే యిద్దరం బయల్దేరి రాజమార్గాలూ, వీధులూ, సందులూ, గొందులూ, యిరుకుగల్లీలు పదిగంటలవరకూ తిరగడం, నీరసం గెంటేస్తూంటే హోటల్లోపడి నాలుగు మెతుకులు వేసుకుని ఆఫీసుకు పోవడం. ఐదుగంటలవరకూ అక్కడ గొడ్డుచాకిరీచేయడం—తరువాత మళ్ళీ సందులంటా గొందులంటా తిరగడం, ముఖాలు వేలవేసుకుని హోటేలుచేరుకుని భోంచేసి, హోటేలుఅరుగుమీదనో, బీచిలోనో, రైల్వేప్లాట్‌ఫారం మీదనో, కిల్లీకొట్టు బడ్డీ మీదనో కునుకడం యిదీ మాదినచర్య. ఇలా వారాలూ, పక్షాలూ, నెలలూ ఎన్నో గడిచిపోయాయి. కాని ఇల్లు సంపాదించడంలో మాత్రం మేం కృత కృత్యులం కాలేక పోయాం.

ఇలా కొంతకాలం గడచేసరికి ఒక శుభవర్తమానం వచ్చింది, ఒక యిల్లు కాళీగా ఉందని. పట్టలేని ఆనందంతో పరుగెత్తాం యిద్దరం.

గృహయజమాని పేరు ముందుగానే తెల్సుకున్నాం గనుక 'కామేశం పంతులుగారూ!' అని పిలచాం. పిలుపు వినగానే కామేశంగారు వచ్చారు. ముణుకులు దిగని అంగవస్త్రం, పైనిమీద చిన్నతువాలూ, కళ్ళకి చవకరకం అద్దాలూ—యిదీ అతనివేషం. మమ్మల్ని ఆపాద మస్తకం చూసేసరికి "నమస్కారం" అన్నాం. మేం యింటికోసమే వచ్చినట్లు గ్రహించుకుని 'యిల్లు చూస్తారా' అన్నారు.

కామేశంగారి తెలివితేటలకూ సంతోషించి "ఊఁ" అన్నాం.

"పదండి" అంటూ తీసుకువెళ్ళాడు.

ఇల్లనేది దొరికితే చాలనే పరిస్థితిలో మేం ఉంటే మాకు నచ్చకపోవటం ఒకటా! పెద్దగదీ, చిన్నగదీ, పెరడూ, నుయ్యీ, దొడ్డీ బాగానే ఉంది.

"నచ్చిందాండి" అన్నాడు కామేశం

"ఏదో మాకు చాలులెండి" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అయితే వినండి. ఇది కేవలం గృహస్థులకే గాని బ్రహ్మచారులకి యివ్వబడదు. యాభైరూపాయిలకి ఒక్కదమ్మిడీ తగ్గదు అద్దె. ఇక కుటుంబీకులకైనా పిల్లలుంటే మాకు కుదరదు. చిత్తగించారా! ఇక యిందులో వంటపెడితే షాగజూరి యిల్లు పాడవుతుంది. అందుచేత నిప్పువెయ్యకూడదు. ఇవన్నీ మీరు ఆలోచించుకుని నా కేకబురైనా రేపు సాయంత్రంలోగా చెప్పండి. వ్యవహారం దగ్గర నేను చాలా ఖచ్చితంగా ఉంటాను. ఆ తరువాత తగువులు పడటం మర్యాదగా ఉండదు చూడండి" అన్నాడు కామేశం.

"సరే ఏకబురైనా రేపు చెపుతామండి" అంటూ తిరుగుముఖం పట్టాం.

"మూర్తీ! కామేశం వంటి వాళ్ళని ఏంచేసినా తప్పులే" దన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఏంకి?" అన్నాను. అప్పుడే సుబ్రహ్మణ్యం ముఖంలో కోపం మెరుస్తోంది.

"ఏవేమిటి. ఆపరతులన్నీ వినలా? నువ్వు పక్క నున్నావుగాని లేకపోతే కావలసినంత గొడవవును. బ్రిహ్మచారుల కిష్వట్ట. డబ్బుకోసం ఏడిసే నాడికి బ్రిహ్మచారైతే ఏడికెందుకు కాకపోతే ఏడికెందుకు, ఇక గృహస్తుడికైనా పిల్లలుండ కూడదుట. ఇంత వరకూ ప్రిభుత్వమే పిల్లల్ని కనకూడదని శాసించ లేదు. ఫూల్! యీ వెధవ ఇంటికోసం యిల్లు దొరకని వాళ్ళు పిల్లల్ని కనుక్కోవడం మానేస్తారోయ్. పోనీ భార్యా భర్తలే ఉన్నా యింట్లో వండుకుందికి ఏల్లేదుట. అంటే హోటలు నుంచి తెప్పించుకోవాలి. యాభైరూపాయిలు వీడినెత్తిని కొట్టి, మరో యాభైరూపాయిలు భోజనానికి యిచ్చి, యింకో ముప్పైరూపాయిలు కాఫీకీ టిఫెన్‌కీ అయితే యిక మిగతా ఖర్చులు? నాలుగు నెలల జీతాలు సరిపోతాయ్‌టోయ్. వీడూ వీడి దురాశానూ. ఎలాగైతే నేం కట్టించాడోయ్ యిల్లు. బోడి యిల్లూ, వీడూను."

నాకు నవ్వొచ్చింది.

"నువ్వలా తేలిగ్గా నవ్వేశావ్ గాని నాకు మాత్రం ఒళ్లు మండిపోతోంది."

"అయితే ఏం చేస్తాం సుబ్రిహ్మణ్యం"

"ఎలాగైనా వాడికో గుణపాఠం చెప్పాలి."

"ఎలా? ఆయింట్లో దిగితే ఎలాగైనా చెయ్యొచ్చు. యిద్దరమూ బ్రిహ్మచారులం అయిపోయాంకద."

"ఈరాత్రిల్లా ఆలోచిద్దాం పద."

"మూర్తీ! నీవిక్కడేఉండు. నేనాయింటికి వెళ్లొస్తా" నన్నాడు సుబ్రిహ్మణ్యం మర్నాడు సాయంత్రిం.

"బ్రదర్ ! నువ్వొక్కడివే వెళితే ఏం తగువు తెస్తావో."

"నువ్వేం భయపడ నక్కర లేదు. ఈ రోజు శాంతం నాలో మూర్తీభవించింది." అంటూ బయల్దేరాడు

సుబ్రహ్మణ్యం వెళ్ళేసరికి కామేశం పత్తులు లేడుట. కాని యింటిదగ్గర మాత్రం చెప్పవలసిన సంగతులు చెప్పాట్ట. మీరు చెప్పిన షరతులన్నిటికీ ఒప్పుకున్నా ననిన్నీ, వారం రోజుల్లో భార్యని తీసుకువస్తాననిన్నీ, తనకి పిల్లా జెల్లా లేరనిన్నీ చెప్పి ఆగదికి తాళంవేసి వచ్చాడు సుబ్రహ్మణ్యం.

ఇది జరిగిన నాలుగు రోజులకే నాకు ట్రాన్సుఫర్ ఆర్డరు వచ్చింది. వెంటనే వెళిపోయాను. తరువాత నాకూ సుబ్రహ్మణ్యానికీ మధ్య ఉత్తరాలు నడవలేదు.

* * * *

టీ తాగి ప్లాట్‌ఫారం కొసకి పోయి కూర్చున్నాం. మంచీ చెడ్డా మాట్లాడుకున్నాక యింటి సంగతి ప్రారంభించాడు.

"నిన్ను రైలెక్కించేసి రెండు పెట్టెలు ఆయింట్లో పడేసి డబుల్‌లాక్ వేశాను. నేను తిరిగి అక్కడకు వెళ్ళనేలేదు రెండు నెలల వరకూ కామేశానికి కనుపించ కుండా తిరిగాను. కామేశం మాత్రం ఊళ్ళోఉన్న ప్రతి ఆఫీసుకూ తిరిగేవాడు నాకోసం. యీగొడవ కొంతమందికి చెప్పాడు కూడా. కాని నాకు మాత్రం యీ విషయం ఏమీ తెలియనట్టే నటించాను.

పెద్ద మనుషుల్ని దగ్గర పెట్టి తాళం విడగొట్టించే ఉద్దేశంతో కామేశం ఉన్నట్టు నాకు తెలిసి ఊరూ, పేరూ వ్రాయకుండా, సంతకము బోధపడకుండా, ఉత్తరము వ్రాసి యక్స్‌పెరమెంటల్ పోస్టాఫీసులో పడేశాను. ఒక నెల రోజులలో వచ్చి యింటద్దె అంతా యిచ్చేసి సామాన్లు పట్టించుకు పోతానని అందులో వ్రాశాను. తరువాత రెండు నెలలు శలవు పెట్టేసి యిక్కడకు వచ్చేశాను."

"తరువాత" అన్నాను శ్రద్ధగా.

"శలవాఖర్ని యిక్కడికే బదిలీ చేయించుకున్నాను. ఆర్నెల్లవరకూ ఎవరూ రాకపోవడం చూచి కామేశం ఒక ప్రకటన చేసాట్ట. ఇంట్లో దిగి పరారైన వాళ్ళు నిర్ణీతమైన తేదీలోగా రాకపోతే పెద్దమనుషుల ఎదుట తాళాలు విడగొట్టిస్తామనిన్నీ, అందులో సామాన్లు పోలీసులకి అప్పగిస్తామనిన్నీ ప్రకటన సారాంశం."

"మరి నీ పెట్టెలు సంగతి."

"ఖాళీ పేకేజీడొక్కులోయ్."

ఆపుకోలేని నవ్వొచ్చింది నాకు.

"తరువాత" అన్నాను.

"తరువాత ప్రకటించినట్లు కార్యక్రమం నడిపించాట్ట. ఖాళీడొక్కులు చూచి పెద్దమనుషులు తెగనవ్వారుట. అదో పెద్దగోడవ. ఇప్పుడు కామేశం యిల్లు అద్దెకివ్వటం మానుకున్నాట్ట."

# కలిసి వచ్చిన జ్యోతిషం



టిక్కట్టు తీసుకొని ప్లాట్‌ఫారం మీదికి వచ్చేసరికి బండి కదలి పోతోంది. ఎదురుగా ఉన్న కంపార్టుమెంటు లోనికి ఎక్కి పోయాను. ఒక్క అమ్మాయి తప్ప అందులో మరెవరూ లేరు. ముందు బెర్తుమీద ఆవిడ కూర్చుంది. ఎదుటి బెర్తుమీద ఒక సూట్‌కేసు వుంది. సూట్‌కేస్ మీద మిస్. శారద అని చక్కగా పెయింట్ చేసి వుంది.

'ఇది లేడీస్ కంపార్టుమెంటు ప్లీజ్' అందామె.

"సారీ! క్షమించి నాలుగు స్టేషన్ల వరకూ ఓపిక పడితే నా ప్రయాణం కాస్తా పూర్తవుతుంది."

ఆవిడ ఏమీ సమాధానం చెప్పకుండా ముఖం అటు ప్రక్కకు తిప్పేసుకుంది. అయిష్టతతో కూడుకున్న ఆమె మౌనాన్ని కూడా అర్థాంగీ కారంగానే భావించుకుని వెనుక బెర్తు మీదికి పోయాను. మరేమీ అననందుకు ఆమెను అభినందించుకుంటూ.

ఒకే స్త్రీ ఉన్న కంపార్టుమెంటులోనికి ఒకే పురుషుడు ఎక్కితే చాలా ప్రమాదాలున్నాయని చెప్పేవాడు శాస్త్రి. శాస్త్రి కొన్నాళ్ళపాటు రైల్వే వాతావరణంలో తిరిగిన వాడున్నూ, నాకు అంతరంగిక మిత్రుడున్నూ అవటంచాత అతని మాటలు తు. చా. నమ్ముతాను. వెనుకటికి యిలాంటి సంఘటనే జరిగిందట. ఒక వేశ్యారత్నం

ప్రయాణం చేస్తూన్న కంపార్టుమెంటు లోనికి ఒక వైశ్య రత్నం ప్రవేశించాడుట. అంతటితో ఊరుకోకుండా ఆమె చూస్తూండగా తన ధనికత్వాన్ని ప్రదర్శిస్తూ పెట్టె లోంచి కరెన్సీ నోట్లు కట్టలు తీసి లెక్కపెట్టడం మొద లెట్టాడుట. ఇదంతా చూస్తూ ఆ వేశ్యారత్నం గంభీరంగా లేచి నిలబడి నాకొక నోట్లకట్ట యిస్తావా లేక గొలుసు లాగి నన్ను బలాత్కరిస్తున్నట్టు రైల్వేవాళ్ళకూ, పోలీసు లకూ తెలియబరచ మన్నావా అందిట. తరువాత కథ చాలావుంది.

ఇలాటి ప్రమాదాలు ఏమీలేకుండా ఉండాలని కోరుకుంటూ కూర్చున్నాను. ఆమె నావైపు చూడనైనా చూడనందుకు అభినందించుకుంటూ.

రైలు బాగా వెళుతోంది. ప్రక్కస్టేషన్ వస్తున్నట్టు పెద్ద కేక వేసింది. ప్రక్కస్టేషన్‌లో ఎక్కి ఎవరైనా లోపలికి వచ్చేస్తారేమో నన్ను చూసి, అప్పుడు నా వునికికే ప్రమాదం వస్తుందని కంపార్టుమెంటుమీద సుద్దతో వ్రాసివున్న 'లేడీస్ ఓన్లీ'ని చెరపేసి 'రిజర్వ్' అని వ్రాసేసాను. నేను వ్రాసింది చూడకుండా ఉండాలని ఆమె యత్నించింది కాని ఆ ప్రయత్నాలు కొద్దిసేపటి లోనే విఫలమయాయి. ఆ తరువాత కూడా ఆమె ఏమీ అనలేదు. బుద్ధిమంతుల లక్షణాలు పూర్తిగా ఉన్నా యనుకున్నాను.

ప్రక్కస్టేషన్ చాలా చిన్నది. అక్కడ జనంలేరు. బండి కదలుతూండగా ఎవరో పెద్దమనిషి గభీమని మా పెట్టెలోనికి ఎక్కిపోయాడు.

'ఇది రిజర్వుడు సార్!' అన్నా.

'నేను చూసే వచ్చానుసార్! మీ ఉభయుల తోనూ ఒక పావుగంట మాట్లాడదామని.'

మీ ఉభయులు అనటంతో ఆమె చిరాకుగా చూసింది.

'నాతోనా!' అన్నాను.

ఔనన్నట్టు బుర్రఊపి నాపక్కను కూర్చొని చంక లోని పుస్తకం పక్కనుపెట్టి జేబులోంచి తీసాడు - ఒక అంగుళం ముక్కా, స్కేలూ, డివైడర్స్, ఒక భూతద్దం, ఒక పెన్సిలూ.

'మీ కుడిచెయ్యి యిలా యివ్వండి.'

'మీరు సాముద్రిక వేత్తలా.'

'మరేం!'

'క్షమించండి నాకు ఆ శాస్త్రంమీద ఏమీ నమ్మకం లేదు.

'మీబోటివాళ్ళ దురభిప్రాయాన్ని పోగొట్టడానికే నేను కంకణం కట్టుకున్నాను'.

'మీ ఉద్యమానికి అభివందనాలు నన్ను మాత్రం...'

'మీరు నాకేం పెద్ద ప్రతిఫలం యివ్వనక్కరలేదు.'

'మీరు ఊరుకుంటేనే ప్రతిఫలం యిచ్చుకుంటాను.'

'పోనీ నేను చెప్పేది వినండి. మీకు కాస్సేపు కాలక్షేపం అయినా అవుతుంది.'

కాలక్షేపానికి 'ఊ' అన్నాను. మా గొడవ ఆమె చూసీ చూడనట్టు ఉన్నదేగాని విషయం యందు శ్రద్ధగానే ఉన్నట్టు గ్రహించాను.

చెయ్యి అందించాను. భూతద్దంలో రేఖలన్నీ చూసి, డివైడర్సుతో కొలిచి స్కేలుమీద లెక్కచూసాడు.

వచ్చే సంవత్సరం యీ నెల యీ తారీఖు లోగా మీకు పుత్రసంతానం' అన్నాడు.

'జీవితంలో జరిగినవి, జరుగుతున్నవి, జరగబోయేవీ, ఎన్నో సంఘటనలు ఉంటే ముందుగా సంతాన విషయం ఎత్తుకున్నారేం మహాశయా!'

'ఇదిమాత్రం ముఖ్యవిషయం కాదూ!'

'నిజమే కాని మీరు పప్పులో బాగా కాలువేశారు.'

'నేనా! సంతాన రేఖ అంత స్పష్టంగా కనిపిస్తూంటే'

'శుద్ధ అబద్ధం'

'ఇదే అబద్ధం అయితే యీ పుస్తకాన్ని వ్రాసిన వాడు కీరో కాడూ, యీ చెబుతున్నది పామిస్ట్ శర్మా కాడు'.

'బలే బలే!'

'ఇంతెందుకూ ఒక్క సంవత్సరముకదా! ప్రత్యక్ష ప్రమాణం మీకే అవుతుంది. యీ శర్మ చెప్పిన మాటలు మీరూ మీభార్యా జ్ఞాపకం ఉంచుకోండి.' అంటూ నావైపూ ఆమెవైపూ చూసాడు.

నాకు చెడ్డ అసహ్యం వేసింది. ఆమె ముఖం కోపంతో ఎర్రబారింది.

'మీ సాముద్రిక శాస్త్ర ప్రవీణత్వానికి శతకోటి నమస్కారాలు మహాశయా! లేనిపోని తగువులు కూడా తీసుకురాకండి. ఆవిడ ఎవరో ఆవిడ మానాన్ని ప్రయాణం చేస్తోంది. నామానాన్ని నేనున్నా'

'అయితే యిద్దరూ కలసి ఒక కంపార్టుమెంటు రిజర్వు చేసుకున్నారన్నమాట.'

'షటప్' అన్నాను కోపం పట్టలేక.

పామిస్టు బిక్కచచ్చి ఒక మూలకు పోయాడు. ఏదో పెద్దనేరం చేసినవాడల్లే నేనూ బాధపడుతున్నాను. ఆమె బిక్క ముఖం వేసింది.

అక్కడ ఉండడం యిక ఎంతమాత్రం శ్రేయస్కరం కాదని పక్క స్టేషన్‌లో పక్క పెట్టెకు వెళిపోయాను. ఆమె ఎంత బాధపడుతోందో అనే నా ఆలోచనతోనే గమ్యస్థానం వచ్చేసింది.

'ఏం శారదా! పొద్దున్న బండీలో రాలేదేం.'

'హల్లో! మూర్తీ! కమాన్! కమాన్! ఈమె మా చెల్లెలు శారద' అన్నాడు మాస్నేహితుడు భూషణం.

'అవబోయే భార్యా భర్తలు ఆలోచించు కున్నట్టు ఒక్కసారే దిగారే' అన్నాడు భూషణంతో వచ్చిన పెద్దమనిషి.

* * *

సంవత్సరం కాకుండానే బారసాల చేసుకుని సకుటుంబంగా రైలు ప్రయాణం చేస్తున్నాం. ఒక స్టేషన్‌లో పామిస్టు శర్మ మా రిజర్వుడుపెట్టె ఎక్కాడు.

'హల్లో! నన్ను మరిచిపోయారా, నేను చెప్పింది నిజమైందా.'

'కాకతాళీయంగా'

'అవును యిప్పుడలాగే అంటారు. ఆవిడ మీభార్య కాదన్నారే.'

'అప్పటికి కాదు.'

'అరే! యిప్పుడైనా నాఫీజు యిచ్చేయండి.



# యంత్రంగా మారిన ★★★
# ★★★ సీతారామయ్య

"ఇప్పుడేమిటోయ్ వెధవ అర్జంటు ఏమిటంత కొంపలంటుకు పోతున్నాయ్!"

"నాకేం తెలుస్తుంది బాబూ! వారు పంపించారు. నేను తెచ్చాను" అన్నాడు ప్యూన్.

"అతనికి మతిలేకపోతే నీకైనా బుద్ధి ఉండొద్దూ? అయిదు గంటలవస్తోంది కదా యిప్పుడు నా మొహాం మీద వేస్తే ఎలా అవుతుందనుకున్నాడు? మరీ వేషంగా ఉంది." అని చీదరించుకుంటూ ఎర్రసిరాతో "వెరీ అర్జంట్ - యిప్పుడే టైపుచేసి పంపాలి" అని మేనేజరు స్వహస్తాలతో వ్రాసి పంపించిన పేడ్‌ను విప్పాడు. గ్రంథం చూచేసరికి శీతారామయ్యకి గుండె గుభేలుమంది. బ్రహ్మలిపితో వ్రాసిన పదితావుల గ్రంథం.

సీతారామయ్యకి మేనేజరు మీద చాలా కోపం వచ్చింది. తన మీద ఏదో ప్రత్యేకమైన కసి లేకపోతే యిలా పంపిస్తాడా? ఎందుకు పీడికీ పోయేకాలం.

ఏమనుకున్నా తప్పుతుందా తలమున్కకున్న తరువాత!

అసలు సీతారామయ్య ఆ రోజున అందరికన్నా ముందుగా పోదామనుకున్నాడు.

సాధారణంగా గుమస్తాల సంగతి ఎలాగుంటుందంటే వాళ్లు జీతం పుచ్చుకున్న రోజు తప్పించి మిగతా అన్ని

రోజుల్లోనూ అప్పుకోసం ప్రయత్నిస్తూనే ఉంటారు. యదార్థం చెప్పవలసివస్తే వాళ్ళకి జీతం అందకుండా ఉంటేనే ప్రాణాలకి కాస్త సుఖంగా ఉంటుంది. ఎవరూ ధైర్యంగా బాకీలను అడగలేరు. అంతవరకూ ఇంకెక్కడైనా అప్పుపుడుతుంది కాని జీతం వచ్చిన తరువాత మాత్రం డబ్బు యివ్వకపోతే ఎవరూ ఊరుకోరు.

సీతారామయ్య అంతకు ముందురోజు నుంచే అప్పుకోసం అన్వేషిస్తున్నాడు. వాళ్ళ ఆఫీసు క్యాషియర్‌ని అడుగుదామనుకున్నాడు. క్యాషియర్ ఎప్పుడూ యింతవరకూ 'యివ్వలేను' అని అనలేదు కాబట్టి తప్పకుండా యిస్తాడని సీతారామయ్యకి ధైర్యం. క్యాషియర్ దగ్గర డబ్బుపుచ్చుకొని త్వరగా షాపుకి వెళ్ళి బియ్యం తెచ్చుకోవాలని సీతారామయ్య ఉద్దేశం. ఆ రోజు బియ్యం తీసుకు వెళ్ళకపోతే పస్తు పడుకోవడం తప్పదని ధృఢంగా తెలుసు సీతారామయ్యకి. అందుచేత అలాంటి పరిస్థితుల్లో 'అర్జెంట్‌పాడ్' చూసేసరికి మేనేజరు మీద కోపం రావడం ధర్మమే.

టైపు మిషను మీద సవాలు చేసి టపటప లాడిస్తున్నాడు. మిషనుగంట గడియారం టిక్కుటిక్కుతో శ్రుతి కలుపుతోంది. ఊపిరి బిగబట్టి మరీ టైపు చేస్తున్నాడు సీతారామయ్య. ఆ సమయంలో సీతారామయ్య ప్రపంచంలోని టైపిస్టులందరిలోనూ అగ్రగణ్యుడా అనిపిస్తుంది.

"ఇంకా కాలేదా బాబూ! మేనేజరుగారు తొందర పడుతున్నారు" అన్నాడు బంట్రోతువచ్చి.

"నేనూ యంత్రంతో పనిచేస్తున్నాను కాని నేనూ యంత్రంగా మారలేదు. ఈ సంగతి చెప్పు" అన్నాడు సీతారామయ్య మహాకోపావేశంతో.

ఆ క్షణంలో సీతారామయ్యకూడా యంత్రంగా మారి పనిచేస్తున్నాడు ఆసంగతి సీతారామయ్యకు తెలియదేమో.

ఆరు గంటలయింది బాగా చీకటి పడింది. సీతారామయ్య యంత్రాన్ని ఆపి ఫైలు తిరగేసి చూశాడు, యింకా కొట్టవలసింది ఆరు పేజీలుంది. సీతారామయ్యకి ముచ్చెమటలూ పోశాయి. దీపం వెలుగులో టైపు చెయ్యడం కష్టమనిపిస్తోంది. ఎంత ఎలక్ట్రిక్ దీపం అయినా దీపం దీపమే!

టైపు యంత్రంతో అనునిత్యం పనిచేసేవారికి నరాల బలహీనతా, కళ్ళజబ్బులూ త్వరగా వస్తాయని ఇటీవలనే చెప్పిన డాక్టరు మాటలు సీతారామయ్యకి చెవుల్లో గింగురు మన్నాయి. అది తన స్వానుభవం కూడాను అందుకనే యీమధ్య సీతారామయ్యకి కళ్ళజోడు అవసరం కూడా కలిగింది. యంత్రాన్ని ఆపి ఆలోచించాడు. ఉద్యోగం మానేద్దామనుకున్నాడు. కాని గడచేదెట్లా? సరోదగ్గరైనా యీ ఉద్యోగమేగా యిచ్చేది. పది సంవత్సరాల సర్వీసు చక్కని ఉద్యోగం. రిటైరైతే పెన్షన్. ఇవన్నీ తలుచుకునేసరికి సీతారామయ్య వేళ్లు వాటంతటవే కదిలాయి. ఆసమయంలో అదృష్టంకొద్దీ యింటి మాట జ్ఞాపకం వచ్చింది సీతారామయ్యకి. ఇల్లూ, భార్యా, సంసారం - ఇంట్లో బియ్యం లేవు!

చరచరా దిగి కిందకి వెళ్లాడు. అప్పుడే క్యాపియర్ యింటికిపోయి గంటపైన యింది. యింకెలా? షాపులుకూడా మూసేస్తారు. సీతారామయ్యకి మహా కోపం వచ్చింది. విచారంతోకూడిన కోపం. యీరాత్రికి ఏందారి? భోజనం ఎలా? మేనేజరు ప్రాణానికి ఏడుస్తూ వస్తుండవలసిందే.

"బాబూ వేగం తెమ్మంటున్నారు" అని మరోసారి హెచ్చరిక.

ఆ కోపంలో ఒళ్ళు తెలియకుండా టైపుచేశాడు. గ్రంథం పూర్తయింది.

మేనేజరు దగ్గరకు తీసుకువెళ్ళి అందించాడు.

మేనేజరు కాయితాల్ని చూసి చూసి కోపంగా విసిరేసి "ఇదేనేమిటయ్యా నీ పది సంవత్సరాల సర్వీసూ? నిద్రపోతూ టైపుచేస్తా వేంటయ్యా నాకు తెలియక అడుగుతాను. రేపు ఉదయం ఎనిమిది గంటలలోగా తిరిగీ టైపుచేసి నాసంతకానికి పంపించకపోతే నిన్ను సస్పెండు చేస్తాను. రేపు టపాలో ఎలాగైనా వెళ్ళితీరాలి" అని లేచాడు మేనేజరు కోపంగా.

సీతారామయ్య తెల్లబోయి కాయితాల్నితీసి కిందా మీదా చూసుకున్నాడు. తను చేసిన తప్పు తెలిసింది. కార్బన్ కాయితం ఇటునుంచి అటు తిప్పిపెట్టవలసింది అటునుంచి యిటు తిప్పిపెట్టాడు తొందరలో గ్రంథం అంతా పాడైపోయింది.

మేనేజరు చరచరా వెళ్ళిపోయాడు. సీతారామయ్య కూడా బయలుదేరాడు మెల్లగా యీరోజు లేచినవేళ బాగులేదనుకుంటూ.

యంత్రిలా నడుచుకుంటూ యిల్లు చేరుకున్నాడు. భార్య రత్నం ముసుగు వేసుకొని పడుకుంది. వంటిల్లు తలుపుతీసి చూసాడు. పొయ్యిలో పిల్లి నిద్దర పోతోంది.

సీతారామయ్య పడుకున్నాడన్న మాటేకాని నిద్దర పట్టలేదు. కేవలం ఆకలివల్ల కాకపోయినా, మర్నాటి ఉదయం ఎనిమిదిగంటలలోపుగా టైపుచేసి ఇవ్వాల్సిన కాగితాలమాట జ్ఞాపకం చేసుకోవటం వల్లనే! ఈ సమయంలోకూడా సీతారామయ్య యంత్రింగామారిన సంగతి అతనికి స్ఫురించనేలేదు!.



# సంజీవయ్యా బీచి షికారు.

ఎండ శీతాకాలం దైనా కాస్త చురుగ్గానే ఉంది. ఉదయం తొమ్మిదిగంటలవేళ. సముద్రతరంగాల మీాద నుంచి చల్లటి శీతగాలులు వస్తున్నాయి. బీచి యిసక కొద్దిగా వేడి ఎక్కడానికి ప్రారంభిస్తోంది.

ఆరడుగులకి అరడుగు తక్కువ పొడవైన బక్క పల్చటి మనిషీ, ధోవతికట్టూ, నిండుచేతుల చొక్కా, దానిపైని యిక రెండుమూడు రేవుల్లో పూర్తిగావిడిపోయే కోటూ, కోటుచేతుల్లోంచి కుక్కనాలికల్లా వేలాడుతున్న లాల్చీచేతులూ, ఒక చేతిలో చిక్కంలో పెట్టబడిన సన్‌బాం తు ప్లాసుటు, మరొక చేతిలో ఆఫీసు కాయితాలతో కట్టబడ్డ పాడ్–సంజీవయ్య (అం! యన్. జీ. వో. సంజీవయ్య) ఊగుతుంటూ, జోగుతుంటూ వచ్చి వచ్చి ఆ తొమ్మిదిగంటల వేళప్పుడు బీచిలో కూర్చున్నాడు.

సముద్రం మీాదనుంచి వస్తున్న చల్లనిగాలీ, మీాద నుంచి వెచ్చగా కాస్తున్న చిన్నయెండా, సమశీతోష్ణంగా చాలాహాయిగా ఉంది.

టౌన్‌హాలు వరండాలో పచారుచేస్తూ పేపరు చూస్తూ యిదంతా గమనిస్తున్నాను.

సంజీవయ్యను నాకు తెలుసుగాని అట్టే పరిచయం లేదు. ఏదో అవసరంపడి ఆఫీసులో అతనితో ఒకటిరెండు సార్లు మాత్రం మాట్లాడాను.

ఏదో పడిపోయింది కామోసు వెతుక్కుంటున్నా డనుకుని సహాయం చెయ్యడానికని బయలుదేరాను. తీరా దగ్గరకు వెళ్లి చూసేసరికి అతనేమీ వెతుక్కున్నట్టుగానీ, ఏదైనా వస్తువ పోయిన ఆత్రుతగానీ కనిపించలేదు. అయినా వేళకాని యీ వేళలో యిక్కడకువచ్చి కూర్చో వలసిన అగత్యంలో ఆంతర్యం ఉండకపోదని 'నమస్తే సంజీవయ్యగారూ!' అన్నాను.

'నమస్తే! నమస్తే! తమరా! ఎక్కడో తమని చూసి నట్టుంది. మట్టిబుర్ర తెలివితేటలు ఎంతసేపూ కాగితాల మీదనేగాని మనుషులమీద పనిచెయ్యకుండా ఉన్నాయి' అన్నాడు కళ్ళజోడు సవరించుకుంటూ.

'ఒకటి రెండుసార్లు తమదగ్గరకు వచ్చాను లెండి'.

'అవునవును. ఆ దేజ్ఞాపకం'

'తమరిక్కడ కూర్చుంటే ఏదో పడిపోయింది కామోసు వెతుక్కుంటున్నారనుకుని వచ్చాను.'

'థాంక్స్. ఏమీపడిపో లేదులెండి. చూసారా మాకు రోజూ ఆఫీసు విడిచిపెట్టేసరికి రాత్రి ఎనిమిది గంటలకు తక్కువ కాదు. అప్పుడు బయలుదేరి కాళ్ళీడ్చు కుంటూ యింటికి వచ్చేసరికి ఎనిమిదిన్నరా, పావుతక్కువ తొమ్మిదీ అవుతుంది అందుచేత యీ వూరువచ్చి దగ్గర దగ్గర ఒక సంవత్సరం అయినా ఒక రోజైనా సరదాగా సాయంత్రం బీచికి రావడానికి వీలు చిక్కిందికాదు. యిక సాయంత్రం ఏలాగునా వెళ్లడం కుదరదని నిశ్చయించు కుని యిప్పుడు సరదాగా యిలావచ్చాను.'

కష్టంమీద నవ్వు ఆపుకొని 'మాబాగా చెప్పుతున్నారే ఒకరోజైనా, కనీసం ఒక ఆదివారం నాడైనా మీకు వీలుపడలేదా?'

'మాకు గాదులులేవు మా కుషస్సులు లేవు అన్నాడు మహాకవి. అలాగే మాకు ఆదివారాలూ లేవూ, హాలీడేలూ లేవు. అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠం అన్నట్టు పగలు పదకొండు గంటలనుంచి రాత్రి ఎనిమిది గంటలవరకూ ఆఫీసే స్వర్గం అదే మోక్షం.'

'మీఓర్పుని మెచ్చుకోవాలి'

'ఓర్పుకి మమ్మల్ని చెప్పి తరువాత గాడిదల్ని చెప్పాలి'

'పాపం మీపరిస్థితి చాలా కనికరించవలసిందే'

'అంతా అలాగే అంటారు. పెద్ద పెద్ద వాళ్లు కూడా మాపట్ల సానుభూతిని ప్రకటిస్తారు. మాకు మిగిలింది అదే'

ఇంతలో ఆ తోవంట వెళుతున్న మరో యన్.జీ.వో. వచ్చాడు. యిదేవాటం కాని సంజీవయ్యకన్న కాస్త వయస్సు మళ్లినవాడు.

'ఏంవోయ్ సంజీవి. ఏమిటి యిక్కడ కూర్చున్నావేమిటి ఏదైనా రహస్య కార్యక్రమమా?'

'రహస్యంలేదూ, నాబొందాలేదు. సరదాగా యిలావచ్చాను. బీచి సరదా తీరడం ఎలామరి. సాయంత్రం వీలుపడదుకదా.'

"వీరెవరు" అన్నాడు నన్ను చూస్తూ

"మన సానుభూతిపరుడు"

"వీరు సీతారామయ్యగారు. మా ఆఫీసులో క్లైపిస్టు" అని పరిచయించేసాడు.

"ఇంక లేవోయ్ సంజీవి. తాపీగా నడిచి వెళుతూంటే ఆఫీసుటైం అవుతుంది" అన్నాడు సీతారామయ్య.

అందరం బయలుదేరాం.

సాయంకాలం అమ్మే వేడివేడి బటానీల దుకాణంలో బటానీలు వేయిస్తున్నాడు

"ఓయ్! సీతారామయ్యా! మనం సాయంకాలంవచ్చి ఎలాగూ కొనుక్కోలేం గనుక ఇప్పుడే కొనుక్కొని నములుకుంటూపోతే మంచిదికదూ" అన్నాడుసంజీవయ్య.

వాళ్ల పరిస్థితి చూసి నవ్వాలో ఏడవాలో తెలియటంలేదు.

అందరం బటానీల దుకాణం దగ్గరకు వెళ్లాం.

"ఓ కానీ బటానీలు ఇయ్యవోయ్" అన్నాడు సంజీవయ్య.

"కానీ బేరం లేదండీ"

"కానీబేరం లేదుటోయ్ శీతారామయ్యా!"

"అదేమిటోయ్ కానీబేరం లేకపోవడమేమిటి? మరి కాన్లు ఎందుకు పుట్టాయనుకున్నావ్" అన్నాడు సీతారామయ్య.

"ఏమోనండి ఎందుకు పుట్టాయో. బహుశా సేల్సు టాక్సు కోసం సృష్టించి ఉండవచ్చు, కాని మేం కానీ బేరాలు మానుకున్నాం కిట్టుబాటులేక"

"మేం ఎవరిమో తెలుసా" అన్నాడు సంజీవయ్య.

"ఎవరైతే నాకేమండి నాకు కావల్సింది బేరం. డబ్బు"

"అయితే యివ్వవన్నమాట" అన్నాడు సీతా రామయ్య.

"మంచి బేరమే. శివామని మంచిబోణీ వచ్చింది. ఊఁ! పట్టండి పట్టండి"

"అదేమిటోయ్ మహా ఉత్త పుణ్యానికి ఇస్తున్నట్టు మూలుగుతావేంటి"

"చాల్ చాల్లెండి మా చెడ్డబేరంగాని"

"అదేమిటోయ్. మనిషికి రెండుగింజలైనా రావద్దా"

"బటానీలు రోజూ తిన్న మొగాల్లాగే ఉన్నాయ్. వెళ్ళండి బాబూ వెళ్ళండి"

"నీ దుకాణం దగ్గర ఉండిపోంలే"

అందరం బయలుదేరాం.

"ఎవడో పొగరుబోతులా ఉన్నాడు ఆఫీసరులాగ" అన్నాడు శీతారామయ్య.

"చూసారా సార్! బటానీలు వాడికి కూడా లోకువైపోయాం" అన్నాడు సంజీవయ్య నాతో.

ఏమనాలో తెలియక "నాకు ఇలాం శెలవు ఇప్పించండి" అంటూ సంసుపట్టాను.

---

# సంజీవయ్యా సాహసచర్య



'గడియారం ముల్లు బరువెక్కి పోయాయి కామోసు ఆరునుంచి పన్నెండు వరకూ ఎంతకీ కదలకుండా ఉన్నాయి. సైకిలు పళ్లే ఎత్తుఎక్కడం గడియారం ముల్లకీ కష్టమే కామోసు' అని గొణుక్కుంటూ హెడ్ గుమస్తా గదిలో ఉన్న గోడ గడియారాన్ని చూసి తన గదిలోనికి వెళ్ళిపోయాడు సంజీవయ్య.

మరొకసారివచ్చి చూసాడు.

యింకా పెద్దముల్లు పన్నెండు చేరుకోలేదు.

అప్పటికి నాలుగు సార్లయింది గడియారాన్ని చూట్టం.

యింకొకసారి వెళ్ళిచూసి తిరిగి వచ్చేస్తున్నాడు సంజీవయ్య.

"ఏమండోయ్ యిలా ఓమారు రండి". అది హెడ్ గుమస్తా కంఠం.

"ఎబౌటర్న్" అని విన్న సోల్జరు మల్లే తకీమని వెనక్కి తిరిగివచ్చి హెడ్ గుమస్తా దగ్గర నిలబడ్డాడు.

"యీపూట మీరేం పనిచేసినట్లు కనిపించదు, అటూ యిటూ తిరగడమే కనిపిస్తోందిగాని."

ఎంత పనిచేసినా అది హెడ్ గుమస్తా మామూలుగా అనే మాటే అది.

అయినా సంజీవయ్యకు ఏ మనాలో తోచలేదు, తోచినా ఎదురు జవాబు చెప్పేందుకి దమ్మూలేదు.

"యిప్పటికప్పుడే నాలుగైదుసార్లు యిక్కడకువచ్చి వెళ్ళడం చూసాను."

తను అలా వచ్చినందుకు సంజాషీ చెప్పమని అది వాక్యంగా అడగవమని సంజీవయ్యకు తెల్సు.

"టైం చూద్దామని వచ్చానండి"

"ఏం అయిదవగానే యింటికివెళ్ళి పోదామనా. కొత్తగా నేర్చుకున్నారేమిటి టైం పరికారం పని చేద్దామని."

"అది కాదుసార్. యీ వాళ యింటిదగ్గర కొద్దిగా పనుంది. అందుచేత అయిదవగానే తమతో చెప్పి permission తీసుకుని వెళదామని."

"ఆ సంగతి నాకేం తెలియదు. ఆఫీసరుగారు వస్తారు. వారితో చెప్పి వెళ్ళిపోండి. అతను వచ్చేసరికి అందరూ హాజరుగా ఉండాలని వారు ఖచితంగా చెప్పారు. అది మీకు తెల్సు కూడా. అందుచేత ఆ Risk నేను తీసుకోను!"

సంజీవయ్య తన seat దగ్గరకు వెళిపోయాడు.

ఆఫీసరు రావటం-అతను అయిదు గంటలు దాటితేనే కాని ఎప్పుడూరాడు. పన్నెండు గంటలకు భోంచేసి, ఒంటి గంట నుంచి నాలుగ్గంటల వరకూ హాయిగా పడుకుని, లేచి మొస్తాబై, టీ తాగి కాపీగా బయలుదేరి అయిదుగంటల నుంచి ఆరుగంటలలోపుగా ఎప్పుడైనా రావచ్చు, నిరుత్సాహంగా కుర్చీలో కూర్చున్నాడు, గాలికి రెపరెపమని కొట్టుకుంటున్న టేబిలుమీద కాయితాలు తనని అవహేళన చేస్తున్నట్లున్నాయి.

ఆఫీసుకు బయలుదేరుతున్నప్పుడు చేతికి ఫ్లాస్కు అందిస్తూ శ్రీమతి మరీమరీ చెప్పింది.

ఎమంత పెద్దకోరిక అని అది!

కాస్త వేగిరం రమ్మనమని.

తన అస్వతంత్రి జీవిత నగ్నరూపాన్ని గమనించ లేక "ఊ"అన్నాడు.

కారు హారన్ వినిపించిొది.

తుళ్ళిపడ్డాడు.

ఆఫీసరు వస్తున్నాడు.

ఎలాగువెళ్ళి approach అవడం అని ఆలోచిస్తున్నాడు. ఆఫీసరు వచ్చేసాడు.

ఆఫీసు నిశ్శబ్దంగా ఉంది.

పాదద్వంద్వము నేలమోపి పవనుంబంధించి లేచాడు.

ఏ పని చేసినా ముందుగా హెడ్ గుమస్తాకి తెలియబర్చకుండా చెయ్యడం మంచి పనికాదు. దానివల్ల చాలా చిక్కులున్నాయి. ఆ సంగతి సంజీవయ్యకి తెల్సు. అందుకని హెడ్‌గుమస్తా దగ్గరకు వెళ్ళి "ఒకసారి ఆఫీసరుగారి దర్శనంచేసి వారి Permission తీసుకుంటాను"అన్నాడు.

"ఇప్పుడే వచ్చారు. వెంటనేవెళ్ళి అడిగితే ఏమనుకుంటారో. అయినా వెళ్ళిచూడండి. యీవాళ అర్జంటు కాయితాలన్నీ పడేశారుకదూ"

"అర్జంట్లన్నీ అయిపోయాయండి"

"సరే వెళ్ళు" అన్నాడు హెడ్ గుమాస్తా.

బంట్రోతు అప్పలస్వామిని పిలిచాడు సంజీవయ్య.

"అయ్యగారు ఏం చేస్తున్నారోయ్"

"పేపరు చూస్తున్నారు"

"ఎలాగున్నారు"

"బాగానే ఉన్నారు"

"కోపంగా లేరుగద"

"లేదులెండి"

"ఒకసారి నేను వారి దర్శనం చేస్తానని చెప్పు"

అప్పలస్వామి వెళ్ళి వచ్చి "రమ్మంటున్నారు వెళ్లండి" అన్నాడు.

జంకుతూ జంకుతూ వెళ్లి నమస్కారంచేసి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

'What is the matter' అన్నాడు ఆఫీసరు సంజీవయ్య వైపు చూసి తిరిగి న్యూస్ పేపరు చూసుకుంటూ.

'యీవాళ యింటిదగ్గర కొద్దిగా పనుందిసార్ కాస్త త్వరగా యింటికి వెళ్ళడానికి శెలవు యిప్పిస్తారని మనవి చేస్తున్నాను.'

'హుఁ' అన్నాడు ఆఫీసరు.

'చిత్తం' అన్నాడు సంజీవయ్య.

'నేను యిక్కడ ఉన్నప్పుడు మీరందరూ వుంటే నాలుగు కాయితాలూ చూసుకోవచ్చునని నేను చెపితే ఏదో సాకుపెట్టుకుని యిలాచేస్తే ఎలాగ' అన్నాడు.

సంజీవయ్య ఏమీ జవాబు చెప్పలేదు.

'సరే వెళ్ళండి వెళ్ళండి'

'శలవ్, అనుకుంటూ నమస్కారంచేసి యింటి బయలు దేరాడు.

కళింగయుద్ధం జయించిన అశోకుడిలా అతనిలో విజయగర్వం లేదు.

యింటికి వస్తున్నాడన్న మాటేగాని 'సరే వెళ్ళండి వెళ్ళండి' అన్న ఆఫీసరు మాటలు మామూలుగా వెళ్ళమనో లేక సరేవెళ్ళు నీసంగతిచూస్తాను అన్న అర్థంతో అన్నాడో అర్థంకాలేదు సంజీవయ్యకి.



# —★ సంజీవయ్య సంధ్యాస్వప్నం ★—

సంఘమూ, ప్రభుత్వమూ నిర్మించిన శాసనాలవల్ల ఎన్నో తీరని కోరికలూ, బయటకు వ్యక్తపరచరాని అభిప్రాయాలూ, ప్రతి మానవ హృదయంలో దాగి ఉంటాయి. వీటి ఫలసిద్ధికి వాస్తవిక జగత్తులో అవకాశం లేదు కాబట్టి స్వప్న జగత్తు వీటి అనుభూతిని ప్రసాదిస్తుంది.

మకరసంక్రాంతి సాయంత్రాన్ని రాత్రి కౌగలించుకుంటోంది. ప్రజాసౌకర్యార్థం వెయ్యబడ్డ వీధి ఎలక్ట్రిక్ దీపం వెలిగింది. గది కిటికీదగ్గర మడతమంచంమీద పడుకున్న సంజీవయ్య ముఖంమీద కిటికీ గజాల సందుల్లోంచి వచ్చిన వీధి దీపం వెలుగు పడుతోంది.

వీధిలోంచి ఎన్నికల ప్రచారాల సంఘాలు ఓట్లకోసం నినాదాలు చేసుకుంటూ వెళ్ళిపోతున్నాయి

"పలుతావుల్ వెదజల్లు తెమ్మెరలు పైపై డాయ, శేరాజు వెన్నెలకాయ...

ఎప్పుడో ఎందుకో చదువుకున్న పద్యం జ్ఞాపకం వచ్చింది సంజీవయ్యకి.

లేచి బయలుదేరాడు.

పెద్దపార్కు, రకరకాల చెట్లూ, వాటి పువ్వులూ, వాటి వాసనలూ—

మీదని చల్లని తెల్లని వెన్నెలా—

క్రిందని పరచిన రత్నకంబలిమల్లే మెత్తని పచ్చనిగడ్డీ-

కూర్చుందికి అమర్చిన బెంచీలూ—

రంగురంగుల దీపాల కాంతిలో జలయంత్రం కురిపిస్తూన్న యింద్రధనస్సు జలధారలూ—

వీటన్నింటినీ గడచి నడచిపోతున్నాడు సంజీవయ్య.

బీచికి వచ్చాడు. జనం కిటకిటలాడుతున్నారు. చోటుచూసుకుని సముద్రానికి ఎదురుగా ముఖంపెట్టి కూర్చున్నాడు. సముద్ర తరంగాలు ఎగిరెగిరి విరిగి నురగలు కక్కుతున్నాయి.

"యూ కమ్ హియర్" అని వినిపించింది.

వెనక్కి తిరిగి చూసాడు.

ఎవరో వ్యక్తి—

"ఏం అలా గుడ్లు మిటకరించుకు చూస్తున్నావ్? నేనెవరో కనిపించలేదూ? సెల్యూటైనా చేసావుకావ్. ఎంతపొగరు!" అన్నాడు ఆ వ్యక్తి.

"ఎవరు మీరు? మర్యాదగా మాట్లాడ్డం చాతకాదూ?"

"అంతవరకూ వచ్చిందీ! యిదిగో నీ పెర్సనల్ రికార్డు. యిప్పుడైనా తెల్సిందా నేనెవరో? నీప్రాణాలు నాచేతిలో ఉన్నాయ్."

"అయితే నువ్వు యమునివన్నమాట"

"నోర్ముయ్"

"ఎందుకు ముయ్యాలి?"

"నేను నీ అధికారిని. నువ్వు నా బానిసవు. నే నేమన్నా నువ్వు పడాల్సిందే"

"అదా సంగతి! ఆ లెక్కకొస్తే నేనేకాదు నువ్వు కూడా బానిసవే. నీకూ నాకూ ఒకసంస్థే డబ్బు యిస్తోంది. నీ అదృష్టంవల్ల నీకు శ్రమ తక్కువ అయినా ప్రతిఫలం ఎక్కువ ముడుతోంది. నా దురదృష్టంవల్ల శ్రమ ఎక్కువా ప్రతిఫలం తక్కువా అవుతోంది. నీకు నేను బానిసను ఎలా అయ్యానో నాకు తెలియటంలేదు. నీ కష్టార్జితం నాకేం ధారపొయ్యలేదులే మహా."

"నీ పొగరు అణుస్తానుండు"

"జాగ్రత్తగా మాట్లాడు. ఏం వెళిపోతున్నావ్... నీ యింటి పనులూ, స్వంత పనులూ, అరపచాకీరీ చేస్తూ తైరుకొట్టుకునీ, యిచ్చకాలు చెప్పుకుని తిరిగినవాళ్లు మంచివాళ్లున్నూ, ఆత్మగౌరవం గలవాళ్లు చెడ్డవాళ్ళున్నూ హుః"

*　　*　　*　　*

"నమస్కారం సంజీవయ్యగారూ!"

"ఎవరు నాయనా మీరు. నాలో ఏం గొప్పదనముందని నమస్కారం చేస్తున్నారు?"

"ఇప్పుడు నా దృష్టిలో అదరూ గొప్పవాళ్ళే."

"అయితే మీరు ఎలక్షనులో నిలబడుతున్నారా?"

"మేధస్సు అంటే అది. యిట్టే గ్రహించారు."

"కాని ఏంలాభం?"

"అంటే!"

"అంటేనా. నాకు వోటి హుక్కు వుందో లేదో కూడా నాకు తెలియదు."

"చిత్రంగా మాట్లాడుతున్నారే."

"అవునులెండి. మా బ్రతుకే విచిత్రం."

"మీకు వోటు లేకపోవడమేమిటి?"

"ఆరునెల్లకోసారి బదిలి అవుతూ పూరూరా తిరుగు తున్నాను నేను. నాపేరు ఏవూరి లిస్టులో ఉందో, అసలు లేనేలేదో నాకు తెలియదు."

"ఓటింగు మీజన్మహక్కు. ఆ హక్కును మీరు పోగొట్టుకోకూడదను."

"నేనెవరి హక్కో మీకు తెలుసా అసలు— ఇప్పుడే ఒక దురహంకారి నేను తన బానిసనని చెప్పకుంటూ వెళుతున్నాడు."

"మీ ఓటింగు హక్కు మీరు సంపాదించుకోవటం మీ విధి."

"నాకు ఒకవేళ ఓటు వున్నా వెయ్యను."

"పోనీ నాకు వెయ్యవద్దు. ఎవరికి వెయ్యాలని ఉంటే వాళ్ళకే వెయ్యండి."

"ఎవరికీ వెయ్యను. అందువల్ల ఆత్మసంతృప్తి అయినా వుంటుంది."

"ఏం అలా అనేశారు?"

"ఏమిటి లాభం చెప్పండి. మా యిబ్బందులు ఆలోచించేవారు ఒకరైనా ఉంటేకదూ?"

"మీకేం కావాలో చెప్పండి."

"మీరు నన్ను వదిలేటట్టులేరే. ఇన్స్యూరెన్సు ఏజంటుకన్నా రెండాకులు ఎక్కువ చదువుకున్నారు మీరు. సరే రండి నాతో మాయింటికి.

* * * *

"ఇదేనేమిటి మీయిల్లు, కిల్లీకొట్టు బడ్డీమల్లే ఉంది."

"దీంట్లోనే పదిమందికి వంటా, తిండీ, పడకాను. పాకీకపూపాయలు అద్దె. యింకా చూడండి."

"ఇంట్లో ఏమీ ఉన్నట్టు కనుపించలేదే— అందరూ చింకిగుడ్డలు కట్టుకున్నారేమిటి?"

"కడుపునిండా అసలు తిండికి ఉంటేగా?"

"మీ పెద్దవాడు ఏం చదువుతున్నాడు?"

"జీతం కట్టలేక చదువు మానిపించాం."

"మీకు పైపైని అప్పుడప్పుడు ముడుతుందని అంటారు?"

"ఇప్పుడది మూవరకూ రాలేదులెండి"

"మీవోటు నాకు అక్కర్లేదు మహాప్రభూ! నాకు సెలవు ఇప్పించండి."

"అయితే మీఉద్దేశంలో కూడా మేము మనుష్యులం కాం యంత్రాలమనేనా! మాకు స్వేచ్ఛా, విరామమూ అవసరం లేదనేనా...యిదుగో వెళ్ళిపోకండి..."

"ఎం సురుకునే మునిమాపువేళ ముసుగువేసుకుని ఏమిటండీ యీ పలవరింతలు" అంటూ శ్రీమతి తట్టి లేపింది."

తుళ్ళిపడి లేచి కూర్చుని "ఎందుకు లేపావ్ శ్రీమతీ! నేను చెప్పవలసింది చాలా ఉండిపోయింది" అన్నాడు సంజీవయ్య ఆవలించి, చిటికవేసి, మెటిక విరిచి.

"చాల్లెండి. ఎవరైనా వింటే నవ్విపోతారు" అంది శ్రీమతి.



# సంజ ప్రణయం

"శ్రీమతీ! శ్రీమతీ!" తలుపుతట్టుతూ—!

"..........."

"వస్తున్నా."—తలుపుతీస్తూ — "రోజుకు రోజూ మరీబాగుంది. ఇంతవరకూ ఆఫీసుపనేనా?"

"ఏంచెయ్యమంటావ్?"

"కాస్త వేగం యింటికి రమ్మంటాను."

"కాస్తేమిటి ఎంతో వేగంగా వచ్చేద్దామనే ఉంటుంది. కాని పని."

యింట్లో ఒక్కర్తెనూ దెయ్యంలా పడి వుండ వలసిందేగా.'

"ఇంట్లో పాతిక కుటుంబాలవాళ్లు ఉంటూంటే దెయ్యంలా కూర్చోడం ఏం ఖర్మం!"

"అయితే వీళ్ళ గుమ్మందగ్గరా వాళ్ళగుమ్మందగ్గరా చేరుతూ కూర్చోమన్నారన్నమాట."

"పోనీ, ఏదేనా పుస్తకం చదువుకోకూడదూ? పుస్తకాల్నిమించిన స్నేహితులే లేరన్నాడు ఒక విబుధుడు."

"అందుకనే కాబోసు మీరు ఆఫీసును వదలరు వేగం."

"నాచేతుల్లోనే ఆఫీసు ఉన్నట్టు మాటాడతావ్."

"అయిదు గంటలయ్యాక ఆఫీసుఉండదేమో కదండీ?"

"అచ్చులో పడ్డంతమట్టుకు అది నిజమే"

"అంటే!"

"అంటే అచ్చుపడ్డ రూల్సుకీ చేసే పనులకీ ఎప్పుడూ సమన్వయం కుదరదని తాత్పర్యం."

"సమన్వయమో దండాన్వయమో... దువ్వెన తీసుకు వచ్చారా?"

"గట్టివి దొరకలేదు"

"మజ్జిగకి వెళితే దూడచచ్చిన కబుర్లే చెపుతారు ఎప్పుడున్నా."

"బజార్లో లేని వస్తువుల్ని నేను పుట్టిస్తానా!"

"దేశం గొడ్డుపోయింది"

"అయితే ఉండీ తేలేదంటావా?"

"పోనీ మొన్న ను తెచ్చినలాంటిదైనా తేలేక పోయారా?"

"ప్లాస్టిక్ దువ్వెనలు నేను తీసుకురాదలుచుకోలేదు."

"ఏదో ఒకటి తేకపోతే ఎలాగండీ. బొత్తిగా యిబ్బందిగా ఉందే."

"మనవి యినపబుర్రిలు. ప్లాస్టిక్ దువ్వెనలు తల మీద వేసి దువ్వేసరికి విరిగిపోతూంటే ఎన్నని కొనడం?"

"పోనీండి కాని అవునండీ!"

"ఏమండీ?"

"అదుగో అప్పుడే వేళాకోళం ఆరంభించారు."

"ఇందులో వేళాకోళం ఏముంది?"

"ఆ అండీలోనే ఉంది బండారం"

"ఇంతకీ ఏమిటో శలవివ్వండి!"

"అదుగో మళ్ళీ"

"లేదు. లేదు. చెప్పు."

"నే నేమన్నా మీకు వికటంగానూ, వేళాకోళం గాను ఉంటుంది. అసలు నాబ్రతుకే మీకు వేళాకోళం అయిపోయింది."

"అరే! అప్పుడే ఏడుపు వచ్చేస్తోందే. యీ ఆడవాళ్ళకి సహజ కవచంలా ఉంది ఏడుపు. అసలు ఏమిటో చెప్పు"

"అక్కర్లేదు లెండి"

"అప్పుడే అలక వచ్చేసింది. స్త్రీలకి అలక కూడా సహజ సంపదే కదూ. ఇంతకీ అసలు చెప్పావు కావు."

"మీరు చెప్పనిస్తేనా!"

"చెప్పనివ్వక నోరు మూసేనా?"

"చాల్లెదురూ."

"చెప్పుదూ"

"బంగారం చవకైపోయిందిట."

"ఒక్క బంగారమేమిటి. అన్నీ చవకైపోయాయిట."

"అట అంటారేమిటి మీరు కూడా!"

"మరేం అనమంటావ్?"

"ఇంట్లో కూర్చున్న ఆడవాళ్ళం అలా అంటాం కాని బజార్లంట తిరుగుతూన్న మీరు కూడా 'అట' కబుర్లు చెబుతారేమిటి?"

"బజార్లంట తిరుగుతే షాపుకి వెళ్ళి ఆ వస్తువు ధర ఎంత, యీ వస్తువుధర ఎంత అని భోగట్టా చెయ్యాలి కామోసు."

"తెలుసుకోకపోతే ఎలా?"

"తెలుసుకున్నాంగా పేపరు చూసి. ఇంతకూ బంగారం ధర తగ్గిన కెందుకు!"

"ఎందుకేమిటి ఇలాంటప్పుడే ఏమైనా కొంటారేమో అని."

"అదా! పాపం చాలా రోజులనుంచి శ్రమపడి ఆలోచిస్తున్నట్టుంది."

"పోనీండి! ఎప్పుడూ అలాగే అంటారు."

"ఇంట్లో డబ్బు మూలుగుతున్నట్టు కబుర్లు చెప్తావు. ఈకరువులోంచి బ్రతికి బయటపడితే నగలూ, నాణ్యాలూ చేయించుకున్నట్టే!"

"ఇంకా కరువంటారేమిటండీ. ధరలు పడి పోయాయిటగా!"

"పడిపోయాయని పేపర్లో పడిపోయాయి. బజార్లో మాత్రం మన నిత్యజీవితానికి కావలసిన వస్తువులన్నీ మామూలుకన్న బాగా పెరిగాయి."

"మీరు మరీ విచిత్రంగా చెపుతారు."

"అసలు విచిత్రం అదే. పేపర్లో పడిందేదో అదే నిజం కాని మన ఎదుట జరిగేదంతా అబద్ధం అనే పరిస్థితికి వచ్చాం!"

"మిమ్మల్ని అడగటమే తప్పు."

"ఇన్నాళ్లూ ఎలాగో ఓపికపట్టావా..."

"నాలుగు రోజులుపోతే ఒళ్ళంతా బంగారం అయిపోతుంది."

"అదికాదే! మనకి ఎన్నో సదుపాయాలు చేసారు గవర్నమెంటువారు."

"బంగారం యిస్తారు కామోసు!"

"నీకు ఎంతసేపూ బంగారం! బంగారం! బంగారం!"

"ఏమిటో చెప్పండి."

"ఉచితవిద్య, ఉచిత వైద్యం యింకా యిలాంటి సౌకర్యాలు ఎన్నో చేస్తోంది గవర్నమెంటు. ఇకమీద నాలుగుపైసాలు వెనకబడితే."

"అయితే మాతమ్ముణ్ణి తీసుకువద్దామండీ, చదువుకుంటాడు. పల్లెటూరులో పడి పాడైపోతున్నాడు. ఇంతకీ మనం పెట్టేవి నాలుగు మెతుకులేకదూ. మా అమ్మని తీసుకువచ్చి మందు యిప్పించినా బాగుణ్ణు."

"చదువు మన పిల్లలకైతేనే చెప్పిస్తారు."

"సరిసరి! మనవాడు ఎదిగేసరికి యీ రూల్సు మారిపోతాయేమో"

"దానికి నేను గ్యారంటీ యివ్వగలనా? అయిదు సంవత్సరాల కొకసారి గవర్నమెంటు మారుతుంది. అప్పటివాళ్ల బుద్ధి ఎలా వికసిస్తుందో."

"అయితే యిప్పుడు యింతకీ..."

"అంతా మామూలే."



# అప్పగింత (నవల)

రచయిత :— ఈరంకి వెంకటరావు

అభిప్రాయాలు :

"పాత్రల ప్రవర్తనలోని విచిత్ర మనస్తత్వాన్ని పాఠకుల హృదయాలకు హత్తేలా యీనవల చిత్రిస్తుంది.

ప్రస్తుతం మనకున్న తెలుగు ప్రేక్షకుల స్థాయిని దృష్టిలో పెట్టుకుని యీ కథను ఫిల్ముగాతీస్తే ఇందులోని రసపట్టులన్నీ చచ్చిపోతాయేమోనని నాభయం."

— శ్రీ బి. యన్. రెడ్డి.

"......ఒక్క బిగిని యీభాష చదువరిని తీసుకు వెళ్ళిపోతుంది. ఈగమనంలోనే సున్నితమైన మనస్తత్వ సంబంధమైన విషయాలు హృదయానికి నాటుకుపోయే టట్టు చెప్పబడ్డాయి. అక్కడక్కడ చక్కని హాస్యంకూడా ఉంది. ఈనవల ఒకసారి చదివితే మరల మరల చదవ బుద్ధిపుడుతుంది."

— ఆంధ్రపత్రిక

వెల : 75 నయాపైసాలు

ప్రతులకు :

ఈరంకి వెంకటరావు,

తుని

తూ॥ గో॥ జిల్లా.